## సమర్పణ :

ఆంధ్ర రాష్ట్రావతరణమునకు సర్వ
విధముల పాటుపడిన నాయకు
లకు, త్యాగమూర్తులకు—

## వి న తి :

అర్థించినంతనే తమకు స్వామ్యముగల
రచనల నీ 'ఆంధ్రవాణి' యందు ప్రచు
రించుకొన ననుమతి నొసంగిన సహృద
యులెల్లరకు—

ఆదర్శ విద్యామండలి, తెనాలి
ప్రకాశకులు

భారతీ ప్రెస్, తె

# విజ్ఞప్తి

ఆంధ్రుల చిరకాలవాంఛ లీడేరినది. ఆంధ్రరాష్ట్రమవతరించినది. ఈ నవ్యాంధ్రరాష్ట్రమున నాంధ్ర సంస్కృతితోఁబాటు సారస్వతమున కును నూతన వికాస మావశ్యకము. ఆ తలంపుతో నవతరించినదే ఈ వాచకము

కాలమొక యనంతవాహిని. దాని గతి కడ్డులేదు. ఆ కాల వాహిని కనుగుణముగా రూపొందుచుండును సమస్త వ్యవస్థలును. ఆ తీరున దిద్దఁబడునవే నూతన విద్యాప్రణాళికలు. అవి భావిపౌరులను తీర్చి దిద్దుకొనఁగలుగు ననుట సత్యము.

నేఁటి నూతన విద్యాప్రణాళికను, ఆచార్యాంతేవాసుల చిత్త వృత్తులను, పరిస్థితులను నెదుట నుంచుకొని కూర్పంబడినవి ఈ వాచక ప్రథమ, ద్వితీయభాగములు. యస్. యస్. యల్. సి. తరగతియందుఁ బ్రవేశించి ప్రభుత్వపు పరీక్షయందు నెగ్గవలసిన విద్యార్థులకు సోపానప్రాయములుగ నుండ ననువుగాఁ గూర్చఁబడిన వీ వాచకములు. వీనిమూలమున విద్యార్థి లోకమునకు రచనా శక్తియు, కల్పనాశక్తియు, కావ్య రసాస్వాదనానురక్తియుఁ బెంపొందు నని నమ్ముచున్నాము. అట్టి తలంపుతోడఁ గూర్పఁబడినవే వీనిలోని యభ్యాసములు.

మా యీ యత్నమును మన్నించి సహృదయులగు విద్యాశాఖ వారును, అధికారవర్గమువారును, నుపాధ్యాయులును, విద్యార్థులును సర్వవిధముల మమ్ముఁ బ్రోత్సహింపఁ బ్రార్థన.

ప్రకాశకులు

# అనుక్రమణిక

## పద్యభాగము



*. ఈ గుర్తుగల పద్యములు కంఠస్థములు కావించవలసినవి.

## గద్యభాగము

# ఐదవ ఫారము
## సామాన్య పఠనము

### పద్య భాగము

## ౧. కృతఘ్నుఁడు

### తిక్కన సోమయాజి

ఈ యుపాఖ్యానము శ్రీ మదాంధ్ర మహాభారతములోని శాంతిపర్వమందలి తృతీయాశ్వాసములోనిది.

వేదములందువలెనె భారతమునందును ధర్మమర్మములు తెలుపఁబడుటచే భారతమునకుఁ 'బంచమవేద'మను ప్రసిద్ధికలదు. అట్టి ధర్మము లీ శాంతిపర్వమున విశేషముగాఁ గలవు. భారత మితిహాస జాతికిఁ జెందిన గ్రంథము.

సంస్కృత మహాభారతమును వేదవ్యాస మునీంద్రుఁడు రచించెను. అందుఁ బదునెనిమిది పర్వములు గలవు. వానిలో మొదటి రెండున్నర పర్వములను శబ్దశాసనుఁడు తెలిఁగింపఁగా నేకారణముననో పిదప నిన్నూఱేండులవఱకు నా గ్రంథమును బూరింప సాహసించినవారే లేరైరి.

పదుమూఁడవ శతాబ్ది పూర్వభాగమున మహాప్రతిభాశాలియగు తిక్కన సోమయాజి ఆంధ్రమహాభారత రచనకుఁ బూనుకొనెను. నన్నయ రచనవలెఁగాక సోమయాజి రచనయందుఁ దెలుఁగుఁదనము వెల్లివిరిసెను.

తిక్కన, నెల్లూరిమండలము నేలిన మనుమసిద్ధిరాజు నాస్థానమునఁ గవియుఁ మహామంత్రియు నై యుండెను. ఆ రాజున్యనకే మేధావి చేదోడు వాదోడుగా నుండి రాజ్యతంత్రము నెల్లఁ దనచేతులతోఁ ద్రిప్పెను. ఇటుల నీ ధీశాలి ప్రజాసేవ యందును వాఙ్మయసేవయందును, నద్వితీయుఁడై వెలిఁగెను.

తిక్కన యౌవనారంభదశయందే నిర్వచనోత్తరరామాయణమును రచించెను. పిదప విజయసేనమను మఱియొక కృతిని వెలయించెను. ఈయనకుఁ "కవిబ్రహ్మ" "యుభయకవిమిత్రుఁడు" నను రెండు బిరుదములు గలవు.

ప్రకృతభాగము శరతల్పగతుఁడగు భీష్ముఁడు ధర్మజునకుఁ జెప్పినది. ప్రభువునకుఁ గృతఘ్నునితోఁ బొందు తగదనుటకుఁ దార్కాణముగా నీ కథను దెల్పెను.

ఒకానొక బ్రాహ్మణుఁడు నాడీజంఘుండను కొంగవలన నుపకారము నొంది కృతఘ్నుఁడై యా కొంగనే వధియించుట యిందలి యితివృత్తము.

చ. విను మొక బ్రాహ్మణుండు కులవృత్తము పెంపుఁదొఱంగి బోయదా
ని నొకత నాలిఁ జేసికొని నెమ్మిఁ గిరాతులఁ గూడి వేఁటకుం
జనుఁ; దిను మాంస; మద్దురితసక్తుఁడు భోగపరుండు గావునన్
ధనము ఘటింపగాఁ దగువిధంబని చూచి వణిగ్జనంబుతోన్ — 1

వ. చెలిమిసేసి కొండఱు గోమట్లు బేహారంబు వెంట దేశాంతరంబు నకుం జనఁ దానును వారితోడం గూడి పోవంబోవ, గిరిగహన దుర్గమస్థలంబున నొక్క వనగజంబు— 2

ఆ. సాతులోని కుటికి జనపంల నున్మద
లీల నేలఁబెట్టి కాలఁజమరఁ
జొచ్చుటయును, భీతివిచ్చి నల్దిక్కులఁ
బఱచి రెల్లవారుఁ బటురయమున. 3

క. ఆయనయుఁ గాందిశీకుం
డై యుత్తరదిక్కు వాఱె నతి దూరముగా
నా యెడ నొక మార్గము గని
పోయెను దాను నటపోవఁ బోవం గెలనన్. 4

తే. పొదల తఱచున జొంపమై పొడవుఁబఱపుఁ
గలిగి వట్ట్రువఁదనమునఁ జెలువు మిగిలి
యున్న వటభూరుహముఁ గని యుల్ల మచట
నిలువఁగోరిన నా మ్రాని నీడఁజేరి — 5

క. వనలతల కుసుమ గంధము
గొని సుడివడు గాడ్పు దప్పిఁ గొండొక తేర్పం
దను పాఱు నచటఁ గూర్చుం
డె నతం; డట్లుండ నచ్చటికి లలితగతిన్. 6

వ. ఒక్క మహాబకంబు వచ్చె. అది పద్మభవునకుఁ బ్రసాదపాత్రం బగుచు నాడీ జంఘుం డను, రాజధర్ముం డను నను పేళ్లం బరంగు. ఆ కొక్కెరకు నమ్మఱ్ఱి నివాసం బై యుండు; అప్పక్షి యట్లేతెంచి యవ్విప్రునిం గాంచి ప్రియంబు దలకొనుచూడ్కి నాదరించి. 7

* క. "ఎందుండి యేమిపనికై
యెందుల కరిగెదవు భూసురేశ్వర? ప్రీతిం
బొందితి నినుఁగని; తగియెడు
విందవయితి నాకు; నీదు విధ మెల్లం జెపుమా." 8

వ. అని యడిగిన నతం: "నేను మధ్యదేశీయుండ; గౌతముండ; ఒక్క మహానీయచరిత్రుని పుత్త్రుండ. 'అలస్యంబున వేదాధ్యయనాది విప్రకర్మవిరహితుండ నయి కామలోలత్వంబున బోయత యిల్లాలుగా బోయలం గలసి యుండి, పేదఱికంబునకు నలసి బేహారంబు వెంట నొక్క సాతుంగూడి పరదేశంబున కరుగుచోట గిరిగహన దుర్గమ ప్రదేశంబున- 9

క. వనకరి యొక్కటి యా సా
తునకుఁ గవిసి జనచయంబుఁ ద్రుంపఁ దొడఁగుడున్,
వినుు, మెల్లవారునుం గను
కనిఁ బఱచిరి; భీతి నేను గానన భూమిన్ - 10

ఆ. పఱచి దిక్కుదప్పి, భాగ్యంబు కల్మి నీ
దైన నిలయమునకు నరుగుదేరఁ
గంటి" ననిన, "మేలుగాక! నీ దారిద్ర్య
మపనయింతుఁ జింత యపనయింపు. 11

వ. అంతకు నియ్యాతిథ్యంబు గయికొనుము". అని రుచిమంతంబులగు మందాకినీ మీనంబులు సుపక్వంబులు సేసి మధురంబులగు వన్య ఫలంబులు తెచ్చి తృప్తియగునట్లుగా నతనికి-నాహారవిధియొనర్చి, రాత్రియగుటయుం బల్లవపుష్పసాంద్రంబగు శయనంబు గల్పించి,

య బ్బకపతి యద్ధరణీసురునితోడి సముచిత సల్లాపంబులను సుఖ
నిద్రను నా రాత్రి గడిపి, వేగుటయు న విప్రు నాలోకించి, 12

* క. "విను, 'మిత్త్రుండును రజతముఁ
గనకము బుద్ధియును; నాల్గు కారణములు మ
ర్త్యుని దారిద్ర్యము వాయుట'
కని దేవగురుండు సెప్పెఁ;- నన్నిటిలోనన్ - 13

క. మిత్త్రుండెక్కుడు; కాశ్యప
పుత్త్రుఁడ నగు నేను నీకు, భూసురవర ! స
న్మైత్త్రి యనుష్ఠించెద నఁటె
పాత్రముగాకుండుదే యపార శ్రీకిన్ ! 14

తే. నా సఖుండు విరూపాక్షు నామధేయుఁ;
డతనిపురము మధువ్రజ; మదియు మూఁడు
యోజనము లిచ్చటికి; దాని కున్న తెరువు
పట్టి వే చని యాదైత్యభర్తఁ గనుము. 15

క. కాంచి యతనితో నేఁ బు
త్తెంచితినని చెప్పు; మతఁ డతిప్రీతుఁడై
కాంచనమును రత్నంబులు
నంచితుఁగాఁ జేసి యిచ్చు నప్పుడ నీకున్." 16

క. అని యప్పూరిదేస సెప్పినఁ
జని యాతఁ డతనిఁ గాంచి సముచితభంగిన్
వినిపించె రాజధర్ముని
కనుగలమగు సఖుఁడ ననియుఁ, నతని పనుపునన్ 17

తే. అరుగుదెంచితి ననియు, ధనార్థి ననియు,
నిట్లు వినిపించుటయు రాక్షసేశ్వరుండు
దేరకొనఁ జూచి యాత్మ 'నివ్విప్రుఁ డధముఁ
డగుట దోఁచుచు నున్నది యడుగవలయు' - 18

వ. అని తలంచి - 19

క. 'కులమును విద్యయు వృత్తముఁ
గల రూపెఱిఁగింపు'మనినఁ, గలఁగక తన్నుం
దెలియంగఁ జెప్పె విప్రుం;
డలఘుం డగు నసురపతియు నవికృతుఁ డగుచున్ -- 20

క. ఇతఁడెట్టిఁడైన నేమగు !
నతనికి సఖుఁడట్టె ! ఒక మహాత్తర సఖ్యం
బితనిం బాత్రముఁ జేయదె!
యితనికిఁ దృప్తియగునట్టు లిత్తు ధనంబుల్. 21

వ. అని నిశ్చయించి యతనికి నాహార సంచ్ఛాదనంబులు సమీచీనంబులుగా నిర్వర్తింపఁ దనవారి నియోగించి, మఱునాఁడు - 22

క. మహనీయ బహుళ పూజా
సహితంబుగ భోజనంబు సంతృప్తిగ న
మ్మహితాత్ముం డొసఁగె దు
ర్వహ భారము గాఁగఁ గనకరాశియు మణులున్. 23

చ. కుడిచిన పళ్లెరంబును నకుంఠితహర్షముతోడ నిచ్చినం
గడు ముదమంది యెత్తికొని గాఢభరంబున మార్చి మోవఁగా
మెడయును వీఁపు మూఁపులును మిక్కిలి నొవ్వఁగఁ గొంకుపోవ నె
క్కుడు వెస నేఁగుదెంచెఁ, గని కొక్కెర సమ్మదమంద మట్టికిన్. 24

తే. అట్లు సంతోషమునఁ దేలి యతని డప్పి
వోవ బక వల్లభుఁడు పక్షపుటయుగమున
నల్ల వీచి యాహార సమర్పణంబు
సేసి నిసిమైన సుఖనిద్ర సేయుచుండ-- 25

వ. ఆ దుర్బ్రాహ్మణుండు తన రేపటి పయనంబునకు నాహారంబు చింతించి 'యిమ్మహాబకంబు శరీరంబు గ్రొవ్వియున్నది. దీనియందు మాంసంబు సాలంగలదు. ఇది యేమఱి నిద్రవోయెడు. చావనడిచి చెండి కొనిపోయెదం గాక' యని పాపనిశ్చయుండై చీర, సక్కం గట్టిగొని, యొక్క కాష్ఠంబు గరయుగంబునం జక్క నమర్చికొని,

క. అందంద మెడయుఁ దలయు న
మందాటోపమునఁ బెక్కుమాఱు లడిచి చా
వుం దెలియఁజూచి యలరెను
డెందముతో నీక లన్నిటిని వెస నూడ్చెన్. 27

తే. ఊడ్చి బొందువు వ్రచ్చి పేవురిలి నంజు
డంతయును బుచ్చి పొదుకగా నచురఁగట్టి
కొనుచు వేగుఁబోకగుటయుఁ జనియె; నట్టి
సమయమున మేలుకని దనుజప్రభుండు – 28

1. అర్థాదులు:- (3) సాతు = వస్త్రకబృందము. (4) కాందిశీకుఁడు = భయముచే నేదిక్కునకుఁ బోవలసినదియుఁ దెలియనివాఁడు. (6) తనుపారు = తనియు, (9) అలస్యంబునన్=సోమరితనముచే. (10) కనుకనిన్=సంభ్రమముతో. (17) అనుగలమగు=అనుకూలమైన, సమానమైన. (22) సంచ్ఛాదనంబు=వస్త్రము. సమీచీనంబులఁగ = తగునట్లు (28) పొదుకగా = పొదిగా.

2. ప్రశ్నలు:-

1. బ్రాహ్మణుఁడెట్టివాఁడు ? అతఁడు ధనార్జనకొఱకేమిచేసెను ?
2. బ్రాహ్మణుఁడు చేరిన వటవృక్షమెట్లుండెను ?
3. నాడీజంఘుఁడెవరు ? అతనిపేళ్ళేవి ?
4. నాడీజంఘుఁడు బ్రాహ్మణు నెట్లాదరించెను ?
5. మనుజుఁడు దారిద్ర్యము వాయు సాధనము లేవి ?
6. విరూపాక్షుఁడు బ్రాహ్మణునిఁ జూచి యేమని తలఁచెను ? ఏ విధముగా గౌరవించెను ?
7. బ్రాహ్మణుఁడు కృతఘ్నుండై యేమిచేసెను ?
8. విరూపాక్షుని సుహృత్ప్రేమ యెట్టిది ?

3. రచన:- (1) బ్రాహ్మణుని స్వభావమునకును, నాడీజంఘుని స్వభావమునకును గల భేదమును వివరించునది. (2) "వనలతల కుసుమగంధము" అను పద్యమునకు దండాన్వయము వ్రాయునది.

4. వ్యాకరణాంశములు:- (1) కులవృత్తము - నల్దిక్కులు - విప్రకర్మవిరహితుఁడు - మహితాత్ముఁడు. వీని విగ్రహము వాక్యములను, సమాస నామములను గ్రహించునది. (2) డప్పివోవక - అర్పణంబుసేసి - అబ్బెకపతి - సల్లాపంబులు - సన్మదలీల వీనియందలి సంధి విశేషములను బరిశీలించునది.

# ౨. ఘంటాకర్ణుఁడు

## నాచన సోమనాథుఁడు

ఈ భాగము సంవిధానచక్రవర్తియగు నాచన సోమనాథునిచే రచింపఁబడిన యుత్తర హరివంశమునందలి ద్వితీయాశ్వాసము లోనిది.

హరివంశమును వ్యాసమహర్షి సంస్కృతమున రచింపఁగా నందలి పూర్వభాగమును ప్రబంధ పరమేశ్వరుఁడగు నెఱ్ఱాప్రెగడయు, నుత్తరభాగమును నవీన గుణ సనాథుఁడగు నాచన సోమనాథుఁడు దెలిఁగించిరి. వీరిద్దఱును బదునాల్గవ శతాబ్దములోని వారే. కాని యెఱ్ఱన యించుక పూర్వుఁడు.

సోమనాథుఁడు తన గ్రంథము నందలి యశ్వాసాంత గద్యములందు 'సకల భాషాభూషణ, సాహిత్య రసపోషణ, సంవిధాన చక్రవర్తి, సంపూర్ణకీర్తి, నవీన గుణసనాథ' యనునవి తనకు విశేషణములుగాఁ జెప్పుకొనెను. కాని 'నవీన గుణ సనాథుఁడు' 'సర్వజ్ఞుఁడు' ననునవియే యీయనకు బిరుదములుగాఁ జెప్పుచున్నారు.

శ్రీకృష్ణుఁడు శివునిగూర్చి తపము సేయఁగోరి కైలాసమునకుఁ బోవుచు బదరికా వనమును జేరెను. అచట ఘంటాకర్ణుఁడు, కాలాంతకుఁడు నను నిద్దఱు పిశాచాధిపతులు కృష్ణునకుఁ గాన్పించిరి. అందు ఘంటాకర్ణుఁడను నాతఁడు వాసుదేవునియెడ మిగుల భక్తిచూపెను. నారాయణుఁ డాతనిభక్తికి మెచ్చి యాతని కింద్రపదవి నొసంగుట ప్రకృతకథాంశము.

శా. గంగా నిమ్నగదాఁటి యుత్తర తటీకాంతారపర్యంత భూ
మిం గంసారి, పురారిఁ గోరి నియమోన్మీల న్మనఃపద్ముఁడై
భంగాపేత పయోధివోలె ననిలాపాయ ప్రదీపంబు నా
నంగంబొప్పఁగ నుండెఁ దొల్లియుఁ దపోవ్యాసక్తిఁ దానున్నచోన్.

ఉ. కుక్కలు వెంటఁబడ్డ నొక కొన్నిమృగంబులు వాఱె, నెత్తురు
ల్గ్రక్కుచు నేలఁగూలె విశిఖంబులు నాటినఁ గొన్ని, యున్న వే
దిక్కు నెఱుంగ వయ్యెఁ గరదీపనికాయము చాయఁబర్వఁగా
గ్రక్కున వచ్చి రంతట వికారశరీర పిశాచ సైనికుల్. 2

వ. అందులోన. 3

సీ. వికృతాననంబులు విరళదంతంబులు
నిడుపైన దాడలు నిక్కు మెడలు
ముడివడ్డ బొమలును ముమ్మూల ముక్కులు
బల్లవెండ్రుకలును బరికెతలలు
బొక్కి బొమ్ములు లోఁతుబొట్టలు మిడిగ్రుడ్లు
గూని వీఁపులు నిడు గ్రొంకి వ్రేళ్లు
బూరకాళులు నీచఁబోయిన చేతులుఁ
గోలమూఁపులు గుదికొన్న తొడలు

తే. నతిభయంకరగతి సూపు నట్టహాస
కహకహారావములతోడఁ గానవచ్చె
దావపావక ఘనశిఖాదగ్ధతాల
సాలసంకాశమగు పిశాచద్వయంబు.

* క. చనుదేరఁగ నయ్యిరువురఁ
గనుఁగొని మురవైరి వారి కలకలమున నె
మ్మనముం బదిలము చేయక
ఘనతరవిస్మయ వికారకలితముఁ జేసెన్. 5

వ. తదనంతరంబ తద్వికృతవేష వేతాళయుగళంబు నరుల గళంబులు దెగనడిచినఁ దొరఁగు రుధిరంబు చవిగొని రుచియగుటయు "హరికి సమర్పితంబయ్యె." 6

గీ. అనుచు నిరువురుఁ దనుఁ జేర నరుగుఁదేర
గారవంబున వారి నా కంసవైరి
చూచుచుండంగ నం దగ్రజుఁడు గాంచి
పలికె నల్లన గంభీర భాషణముల. 7

ఉ. "ఎక్కడివాఁడవన్న? కడు నీరపుఁ గాఱడవిం జరించె దీ
చక్కని మేను నీ గరువచందము నెంతును గాన మక్కటా
నిక్కము మాకుఁ జిత్తములు నీరగుచున్నవి! క్రూరసత్త్వము
ల్దక్కలిగొన్నఁ బొక్కివడదే మదిలో నినుఁ గన్నతల్లియున్ ! 8

*శా. చేతోజాతుఁడవు నీవు నేమవుదురో! శీతాంశు చూడామణిం
బ్రీతుంజేయఁ దపంబుచేసెదో! విచారింపంగ నక్లేలగుచ్
బాతాళంబును నేలయుం ద్రిదివముం బాలించు సిద్ధుండవో
నాతంత్రీ! నను నేలవచ్చిన జగన్నాథుండవో చెప్పవే!" 9

క. అనుటయుఁ బిశాచవల్లభుఁ
దన భక్తునిఁగా నెఱింగి దామోదరుఁ డ
ల్లనఁ గరుణవొడము కన్నులఁ
గనుఁగొని యిట్లనుచుఁ బలుకు గౌరవ మొందన్. 10

క. "భూజనములు యదువంశము
రా జనఁగా బరఁగుదు; న్నిరంతరమును స
త్పూజయును, దుష్టశిక్షయు
నా జన్మవ్రతము; లఖిలనాథుఁడ నగుటన్. 11

గీ. నాకు నొక కోర్కి కైలాసనాథుచేతఁ
బార్వతీవల్లభునిచేతఁ బడయు తలఁపు
గలదు గావున బదరికా కాననంబుఁ
జూడవచ్చితి; మీరిందుఁ జొచ్చుటేల? 12

చ. వలదు మహామునీశ్వరులు వారె సదాశివ చింతచేత ని
శ్చలగతి నున్నవా; రిది పిశాచ నివాసముగాదు; వీరుఁ గు
క్కలుఁగవియంగఁ బాఱెడిమృగంబులఁజూచి సహింపరా; దహో
నిలువుఁడు, వేయునేల తగునే కటకుట్లనుఁ జంకఁబొత్తముల్. 13

క. వెలి నుండుఁ డిచ్చటికిఁ గా
వలి నే నుండంగఁ జొచ్చువారుం గలరే
బలిమిఁ బిశాచంబులు మీ
రలిగిన వలిగిటిరి చూడనగునే మిమ్మున్." 14

వ. అనుటయును నందగ్రజుం డిట్లనియె. 15

*శా. "ఘంటాకర్ణుండ నేను; నాయనుజుఁ డీ కాలాంతకుం, డేము ము
క్కంటిం గొల్తుము; కిన్నరేశు పనికై కైలాస శైలంబునన్
జంటన్వచ్చిన సారమేయములు నీ సైన్యంబులున్ మావె; యే
వెంటం బోయితి మేమి కాఱడవిలో వేటాడ రే యెవ్వరున్! 16

గీ. నీవు నీ పోవు దెసఁ బొమ్ము నీకు మాకు
మాటలేటికి!" ననుచు నమ్మరులు తేఁడు
నచటఁ బ్రేవులు దర్భలు నాసనంబు
చేసి తన మానసంబునఁ జేర్చెఁ గృష్ణు. 17

వ. విలోచనంబులు దెఱచి చూచి. 18

* సీ. 'పుండరీకములతోఁ బురణించు కన్నులఁ
గారుణ్య మను తేనెగడలు కొనఁగ
మందారశాఖతో మలయఁజాలెడు కేలఁ
బాంచజన్యంబను పండు మెఱయ
నుదయాద్రితటముతో నుద్దించు నురమునఁ
గౌస్తుభంబను దివాకరుఁడు దోఁప
నాకలోకంబుతో నవ్వు పాదంబున
నాకాశ నది యన నమృత మొప్ప
తే. నమృత ధారాధరము మాట లాడినట్లు
భాగ్యదేవత రూపు చేపట్టినట్లు
లలితగతి నున్న సద్గుణాలంకరిష్ణు
విష్ణుఁ బొడఁగంటి భవముల విడుకొంటి.' 19

వ. అనుచుం బ్రణామంబుచేసి. 20

క. పకపక నవ్వుచు నొక వి
ప్రుకళేబర మాంస మెల్లఁ బుచ్చి పునుక పా
త్రిక లోనఁ గడిగిపెట్టుచు
నకుటిల మతిఁ 'కృష్ణ! నీకు నర్పిత' మనుచున్. 21

తే. "ఆరగింపవె దేవ! మాయందు విందు
వేలు పన్నను బాటింతు విప్రమాంస
మిచట మత్ప్రీతిఁ జేసి నన్నేలికొనుము
భక్తిగాని నీ కేమియు బ్రాఁతిగాదు." 22

క. నావుడు మురారి నవ్వుచు
నావేదురు నూఱడించి "యనుచితము మహీ
దేవునిఁ జంపుట" యనుచుం
గై పెక్కిన వాని మేను కరమున నిమిరెన్. 23

వ. నివురుటయును. 24

క. తామరరేకులుఁ గన్నులు,
సామజ హస్తములుఁ దొడలు, శశిమండలమున్
మోమును మెఱపును, నొడలును
సోమింపఁగ దివ్యరూపసుందరుం డయ్యెన్. 25

చ. అతనికిఁ బ్రీతి నిట్లను మురారి "బలారిపదంబు నీకు ని
చ్చితి; నతనిం దొలంగ విధి చేసినవాఁ; డమరావతీ పురీ
పతి వని నేఁడ నీనుదుటఁ బట్టముగట్టితిఁ; గొంతకాల మి
ట్లతిశయభోగమొంది పరమాత్మునిఁ గూడఁగరమ్ము పిమ్మటన్. 26

క. నీ తమ్ముఁడు నీ రూపున
నీతోడన కూడవచ్చి నిర్జరరాజ్య
స్వాతంత్ర్యముఁ గని పిమ్మట
నాతత్త్వముఁ గూడవచ్చు నాకాధిపతీ!" 27

అని వరమిచ్చె.

1. అర్థాదులు:- (1) గంగానిమ్నగ = గంగానది. నిమ్నగ (వ్యు) లోతుగా బ్రవహించునది (నది.) ఉన్మీలత్ + మనఃపద్ముఁడు=వికసించిన మనస్సనెడి కమలము గలవాఁడు. భంగ + అపేతపయోధి = అలలు లేని సముద్రము. (4) చొక్కి = మాంసములేని. ఈచఁబోయిన= వంకరఁబోయిన (8) ఈరపు= గుబురైన. గరువచందము=గరువపువిధము. తెక్కలిగొన్నన్ = మోసగించినచో, హరించినయెడల. (9) చేతోజాతుఁడు= మన్మథుఁడు, చిత్తజుఁడు. (13) కఱకుట్లు =

కాల్చిన మాంసపు ముక్కలు. (16) ఏవెంటంబోయితిమేమి = ఎట్లు సంచరించిన నేమి? (17) మరులుఱేఁడు = పిశాచాధిపతి. (23) కైపెక్కిన = ఉన్మాదము చెందిన. (24) సోమింపఁగ = సరిపోలఁగ.

## 2. ప్రశ్నలు :-

1. "అంగంబొప్పఁగ నుండె" ఎవరు? ఎట్లుండిరి?
2. "గ్రక్కున వచ్చిరంతట వికార శరీర పిశాచసైనికుల్" ఏ విధముగా వచ్చిరి? వా రెట్లుండిరి?
3. "కహాకహారావములతోడఁ గానవయ్యె" కనుపించినదేది? ఎవరికిఁ గాన్పించెను? అది యెట్లుండెను?
4. పిశాచములలో నగ్రజుఁడు కృష్ణునిఁజూచి యేమని ప్రశ్నించెను? దాని కతఁ డేమి యుత్తర మిచ్చెను?
5. వాసుదేవునకు జన్మవ్రతము లేవి?
6. "తగునే కిఱుకట్లునుఁ జంకఁ బొత్తముల్" దీని భావము సందర్భసహితముగా వివరించునది.
7. "విష్ణుఁ బొడఁగంటి భవముల వీడుకొంటి" ఇట్లు పాడిన దెవరు? ఆ విష్ణుఁ డెట్లుండెను?
8. కృష్ణుఁడు ఘంటాకర్ణు నెట్లాదరించెను?
9. "సోమింపఁగ దివ్యరూప సుందరుఁ డయ్యెన్" ఎవరు? ఎట్లు? ఎట్టి దివ్యరూపము నందెను?

**3. రచన:-** (1) పిశాచమునకును కృష్ణునకును జరిగిన సంభాషణమును వివరించునది (2) చేతోజాతుఁడు నీవు నేమగుదురో, భాగ్యదేవత రూపు చేపట్టినట్లు. వీనిని జేర్చి వాక్యరచన చేయునది. (3) 1-13 పద్యములకు దండాన్వయములు వ్రాయునది.

**4. వ్యాకరణాంశములు:-** (1) నెత్తురుల్గ్రక్కుచు - అరుఁగుదేరన్ - చరించెదు - జంటవచ్చిన - ఆరగింపవే. వీనియందలి వ్యాకరణ విశేషములను గ్రహించునది. (2) ధారాధరము - దివాకరుఁడు - శశి - విష్ణువు - కృష్ణుఁడు - నాకము. వీనికి వ్యుత్పత్త్యర్థములను దెలియునది.

# 3. సుభాషితములు

## ఏనుఁగు లక్ష్మణ కవి

ఈ నీతి పద్యములు 'సుభాషిత రత్నావళి' లోని నీతి - శతకము లోనివి. ఈ గ్రంథము నేనుఁగు లక్ష్మణకవి రచించెను.

భర్తృహరి యను యోగి సంస్కృతమున 'సుభాషిత-త్రిశతి'ని రచించెను. అందు నీతిశతకము, వైరాగ్య శతకము, శృంగార శతకము నను మూఁడు శతకములు గలవు. ఈ భర్తృహరి సుభాషితముల నేనుఁగు లక్ష్మణ కవియే గాక యెలకూచి బాలసరస్వతి, పుష్పగిరి తిమ్మయ యనువారు కూడ తేటతెలుఁగుగాఁ దెలిఁగించిరి. కాని లక్ష్మణకవి కృతికే విశేషప్రచారము గలదు.

లక్ష్మణకవి 18 వ శతాబ్దమునఁ బెద్దాడపురమున నివసించి యుండెను. ఈయన తెలుఁగున గంగామాహాత్మ్యము, రామేశ్వర మాహాత్మ్యము, రామవిలాసము నను గ్రంథములను, సంస్కృతమున సూర్యశతకమును గూడ రచించెను.

*మ. పొసఁగం దానము గుప్త మర్థి భవనంబుం జేరుచో సంభ్రమో
ల్లసదుత్థాన విధానమున్ బ్రియవిధుల్ గావించి మౌనంబు రా
జసభన్ మిత్రకృత ప్రకాశనముఁ గుత్సాకర్మవైముఖ్య మీ
యసిధారావ్రతచర్య యెవ్వఁడు మహార్యశ్రేణికిం దెల్పెనో. 1

*మ. ఒకచో నేలను బవ్వళించు నొకచో నొప్పారుఁ బూసెజ్జపై
నొకచో శాకము లారగించు నొకచో నుత్కృష్టశాల్యోదనం
బొకచోఁ బొంతధరించు నొక్కొకతఱిన్ యోగ్యాంబరశ్రేణి తె
క్కకురాసీయఁడు కార్యసాధకుఁడు దుఃఖంబున్ సుఖంబున్ మదిన్.

*చ. ఉరుతర పర్వతాగ్రముననుండి దృఢంబగు ఱాతిమీఁద స
త్వరముగఁ ద్రెళ్ళి కాయము హత బుగఁ జేయుట మేలు; గాలిమే
పరిదారవాతఁ గేలిడుట బాగు; హుతాశన మధ్యపాతమున్
వరమగుఁ జారుశీల గుణవర్జన మార్గముగాదు చూడఁగన్. 3

*చ. అతనికి వార్ధికుల్యయగు, నగ్నిజలంబగు, మేరుశైల మం
చిత శిలలీలనుండు, మదసింహము జింక తెఱంగుదాల్చుఁ, గో

పిత ఫణి పూలదండయగు, భీష్మవిషంబు సుధారసం బగున్
క్షితి జనసమ్మతంబగు సుశీల మదెవ్వనియందు శోభిలున్. 4

*ఉ. గ్రాసములేక స్రుక్కినను, జరాకృశమైన, విశీర్ణమైన, సా
యాసమునైన, నష్టరుచియైనను, ప్రాణ భయార్తమైన సం
త్రాసమదేభకుంభపిశితగ్రహలాలసశీల సాగ్రహా
గ్రేసరభాసమాన మగు కేసరి జీర్ణతృణంబు మేయునే ! 5

*ఉ. స్నాయు వసావసేకమలినమ్మగు నెమ్ముగ్రహించి జాగిలం
బాయతమోదమందుఁ, జన దాఁకలి దానికిఁ; జెంతనున్న గో
మాయువు దానిఁజూచి పరిమార్పక సింగము దంతిఁ గూల్చు, నే
చాయల నెల్లవారు నిజసత్త్వ సమాన ఫలార్థులే గదా !

*ఉ. వాలముఁ ద్రిప్పి, నేలఁబడి వక్త్రముఁ గుక్షియుఁ జూపుఁ, గ్రిందటం
గాలిడుఁ ద్రవ్వు బిండదుని కట్టెదుటన్ శునకంబు; భద్రశుం
డాలము శాలితండులగుడంబులు చాటు వచశ్శతంబుచే
నోలి భుజించు, ధైర్యగుణయుక్తిగఁ జూచు మహోన్నతస్థితిన్.

*మ కరిరాజున్ బిసతంతు సంతతులచేఁ గట్టన్ విజృంభించు వాఁ,
డురువజ్రంబు శిరీష పుష్పములచే నూహించు భేదింప, దీ
పురచింపన్ లవణాబ్ధికిన్ మధుకణంబుం జిందయత్నించు ని
ర్ధరణిన్ మూర్ఖులఁ దెల్పు నెవ్వఁడు సుధాధారానుకారోక్తులన్.

*చ. గురుఁడు గురుండు, వాలు శతకోటి, సుపర్వులు వాహినీపతుల్
సురభవనంబు కోట, మధుసూదనుఁడున్ సయిదోడు, దంతి ది
క్కరిపతిగాఁగ నొప్ప బలఘాతియు దాయల కోడె నాజిలో,
శరణము దైవమే పురుషశక్తి నిరర్థక మెన్ని భంగులన్. 9

*చ. శతభిష గాధ్యుఁడున్, సతత శంభువతంసము నయ్యు, నోషధీ
తతులకు నాథుఁడయ్యును, సుధారస సేవధి యయ్యుఁ, దారకా
పతి దనరాజయక్ష్మభవబాధలఁ బావఁగ నోపఁ డక్కటా
హతవిధి కృత్య మెవ్వనికి నైన జగంబున దాఁటవచ్చునే ! 10

1. అర్థాదులు:- (1) అర్థి (వ్యు) అర్థించువాఁడు (యాచకుఁడు) కుత్సాకర్మవైముఖ్యము=నింద్యములగు పనులందిష్టము లేకుండుట. అసిధారావ్రతచర్య=కత్తియంచుమీఁది నడకవలె మిగుల కష్టమగు నియమమును బూనుట. ఉత్కృష్టశాలి + ఓదనము = శ్రేష్ఠమగు వరియన్నము (3) గాలిమేపరి దొర = గాలి యాహారముగాఁగల సర్పముల ఱేఁడు. (4) కుల్య = కాలువ. (5) పిశిత - గ్రహ - లాలస - శీలము = మాంసమును - తీసికొనుటయందు - ఆసక్తిగల - స్వభావము గలది. (6) స్నాయు - వసా - సేక = నరములందలి నీటితోఁ దడుపఁబడుటచే (7) పిండదుఁడు=అన్నపుముద్ద వేయువాఁడు. చాటువచః + శతము= మంచిమాటల సమూహము. (8) బిసతంతు సంతతి=తామరకాడలలోని దారముల సమూహము (9) వాహిని = (నానా) సేన, నది (10) రాజయక్ష్మభవబాధ = క్షయరోగముచేఁగలిగినబాధ. శతభిషగాఢ్యుఁడు=నూర్గురువైద్యులతోఁగూడిన వాఁడు, శతభిషా నక్షత్రముతోఁ గూడినవాఁడు.

2. ప్రశ్నలు:-

1. "ఈ యసిధారావ్రతచర్య యెవ్వఁడు మహార్యశ్రేణికిం దెల్పెనో" ఆ యసిధారా వ్రతచర్య యెట్టిది ?
2. కార్యసాధకుఁ డెట్లు మెలంగును ?
3. శీలగుణ వర్ణనమునకంటె నేపను లుత్తమములు ?
4. శీలముగల వాని సాహసకృత్యము లెట్లుండును ?
5. కేసరి (ఉత్తమ పురుషుని) వర్తన మెట్లుండును ?
6. "ఎల్లవారు నిజసత్త్వసమాన ఫలార్థులే గదా" ఎట్లో నిరూపించునది.
7. కుక్కకును నేనుఁగునకును గాంభీర్యముపట్లఁగల భేదమేమి ?
8. మూర్ఖులకుఁ దెల్పఁజూచువారి చేఁత లెట్లుండును ?
9. 'పురుషశక్తి నిరర్థక' మను విషయమును నిరూపించునది.
10. చంద్రుని రాజయక్ష్మచే గ్రహింపఁదగు నీతియేమి ?

3. రచన:- 'దైవమే శరణము, పురుషశక్తి నిరర్థకము, హతవిధికృతము దాఁటలేము', వీనిని సమర్థించుచు స్వతంత్ర వాక్యరచన చేయునది.

4. వ్యాకరణాంశములు:- (1) యోగ్యాంబరము - శాల్యోదనము - మహార్యశ్రేణి - భయార్తము - వచశ్శతము - ఈ సంధులను నేర్పఱచి, సంధి నామములను గ్రహించునది. (2) జరాకృశము - సుధాధారాముధురోక్తులు - భీష్మవిషము - శతకోటి - వచశ్శతము ఇవి యే సమాసములో తెలియునది.

---

# ౪. చాటువులు

## పూర్వకవులు

ఆంధ్రసాహిత్యజగత్తున నసమానకీర్తిని నిలుపుకొనిన కవిసార్వభౌముఁడు శ్రీనాథుఁడు. ఈయన తెలుఁగుదేశమున నాలుగు చెరఁగులుత్రొక్కి చూచి పెక్కనుభవముల నార్జించిన వాఁడు. పలువురు రాజులను సందర్శించి వారినిఁ దన సారస్వతశక్తిచే మెప్పించి మన్ననలం బడసి యుండెను. ఈయన రచియించిన మహాకావ్యము లట్లుండ నీయన చాటువులును మిగులఁ బ్రశస్తిగాంచినవి.

శ్రీనాథుఁ డొకమారు సర్వజ్ఞసింగభూపాలుని దర్శించుటకు వేంకటగిరికేగెను. సింగభూపాలుఁడు మహాపండితుఁడు. సర్వజ్ఞబిరుదాంచితుఁడు. ఆయన సభామండపము శారదామందిరము. అందు శారదాదేవి సువర్ణవిగ్రహము గొలువుండును. శ్రీనాథుఁ డాసభలోఁ బ్రవేశించుటతోడనే యా శారదాదేవిని నుతించి తన సామర్థ్యమును వెల్లడించుకొనెను.

సీ. దీనారటంకాలఁ దీర్థమాడించితి
దక్షిణాధీశు ముత్యాలశాల
పరుసతోఁ జై తాంధ్రభాషా మహాకావ్య
నైషధగ్రంథ సందర్భమునఁ
బగులఁ గొట్టించి తుద్భట వివాదప్రౌఢి
గౌడ డిండిమభట్టు కంచుఢక్క
చంద్రభూషక్రియాశక్తి రాయల యొద్దఁ
బాదుకొల్పితి సార్వభౌమ బిరుద
తే. మెటుల మెప్పించెదో నన్ను నింక మీఁద
రావు సింగమహీపాలు దీవిశాలు
నిండుకొలువున నెలకొని యుండి నీవు
సరస సద్గుణ నికురుంబ ! శారదాంబ ! 1

శ్రీనాథుఁడు మహాభోగి, రాజాన్నముల మెసఁగినవాఁడు. ఒకమారు పలునాటిసీమలో నొకయింట భుజించి, యిసుకమయమై యున్న జొన్నసంకటిని మార్గమున వడ్డించని కొలఁదిపాటి పచ్చడితోఁ దినలేక యీ క్రింద పద్యములను చెప్పెనఁట.

ఉ. మూతిని ముట్టఁగా వెఱతు ముద్దకుముద్దకుఁ గూటిలోపలన్
బ్రాతికపాలు సైకతము, పచ్చడి కొంచమె, యాది యంత్యమున్
జూతమటన్న లేదు మఱి సున్నముకన్నను మెత్తనన్న మీ
రాతిరిఁబోలె భోజన మరాతికినైనను వద్దు దైవమా! 2

ఆ. వె. పూర్వమందు విషము పుచ్చుకొన్నానని
గర్వపడెద వేల కాలకంఠ?
కొండవీటి సీమఁ బండు జొన్నలకూడు
దిన్న నీదుబయసి తేఁటపడును! 3

శ్రీనాథుఁడు చరమదశయందుఁ గష్టముల పాలయ్యెను. ఆయన నాదరించిన రాజు లందఱు నంతరించిరి. అట్టియెడ బొడ్డుపల్లి యను గ్రామమును గుత్తకుగొని వ్యవసాయము చేయసాగెను. కాని యందును బెద్దమ్మ యెదురాయెను. ప్రభువున కీయవలసిన శిస్తు చెల్లింపలేకపోయెను. రాజు నిర్దయుఁడై శ్రీనాథుని రప్పించి తన దివాణముముందు నెత్తిని యెండలో నిలఁబెట్టి కాలుసేతులకు సంకెలలు వేయించి మీఁద బండరాతి నెత్తించెనఁట. అపుడు చెప్పుకొనిన నీ పద్యములు.

* సీ. కవిరాజు కంఠంబు కౌఁగిలించెను గదా
పురవీధి నెదురెండ పొగడ దండ
ఆంధ్రనైషధకర్తయంఘ్రియుగ్మంబునఁ
దగిలి యుండెనుగదా నిగళయుగము
వీరభద్రారెడ్డి విద్వాంసు ముంజేత
వియ్యమందెను గదా వెదురుగొడియ
సార్వభౌముని భుజాస్తంభ మెక్కెను గదా
నగరు వాకిటనుండు నల్లగుండు

తే. కృష్ణవేణమ్మ గొనిపోయె నింతఫలము
బిలబిలాక్షులు తినిపోయెఁ దిలలు పెసలు
బొడ్డుపల్లెను గొడ్డేఱి మోసపోతి
నెట్లు చెల్లింతుఁ డంకంబు లేడునూర్లు? 4

సీ. కాశికావిశ్వేశుఁ గలిసె వీరారెడ్డి
రత్నాంబరమ్ము లే రాయఁ డిచ్చుఁ,
గైలాసగిరిపండె మైలారు విభుఁ డేగి
దినవెచ్చ మేరాజు దీర్పఁగలఁడు,
రంభఁగూడెఁ దెనుఁగు రాయరాహుత్తుండు
కస్తూరి కేరాజుఁ బ్రస్తుతింతు,
స్వర్గస్థుఁడయ్యె విస్సనమంత్రి మఱి హేమ
పాత్రాన్న మెవ్వనిపంక్తిఁ గలదు,
తే. భాస్కరుఁడు మున్నె దేవుని పాలి కరిగెఁ
గలియుగంబున నిఁక నుండఁ గష్టమనుచు
దివిజ కవివరు గుండియల్ దిగ్గురనఁగ
నరుగుచున్నాఁడు శ్రీనాథుఁ డమరపురికి. 5

పదునాఱవ శతాబ్ది యుత్తరభాగమున మల్కిభరా మను తురుష్కప్రభు వాంధ్రదేశమును పాలించెను. ఈతఁ డాంధ్ర సారస్వత ప్రియుఁడై పలువురు కవుల నాదరించెనఁట. కవి గానివారి కతఁడు దర్శనమే యిచ్చెడివాఁడు కాడఁట. ఈప్రభువునుగూర్చి యొక కవి చెప్పిన దీ పద్యము.

ఉ. రాజును రాజుగాఁ డతఁడు రాహుముఖంబునఁ జిక్కె, వాహినీ
రాజును రాజుగాఁ డతఁడు రామశరాహతిఁ దూలె, దేవతా
రాజును రాజుగాఁ డతఁడు రావణసూతికి నోడె నాజిలో,
రాజన రాజు మల్కి యిభరాముఁడె రాజు ధరాతలంబునన్. 6

వెలుగోటి వంశపురాజులు వేంకటగిరి రాజధానిగాఁ గొంతకాలము రాజ్య మేలిరి. వారినిఁగూర్చి చెప్పిన చాటువులు పెక్కుగలవు. ఆప్రభువులలో రావు సింగభూపాలుఁ డొకఁడు. ఈయన శ్రీనాథకవికి సమకాలికుఁడు. ఈ ప్రభువును గూర్చి యాదిశేషునకును, నారదునకును జరిగిన సంభాషణ రూపముగాఁ జెప్పఁబడిన దీ పద్యము.

*శా. ఏమీ శేషుఁడ ? ఏమి నారద ? ముదం బేపారునా ? తొంటి వి
శ్రామం బేమియు లే; దదేమి? ససిమీఱన్ రావు సింగాంకుఁ డు
ద్దామ ప్రౌఢి జయింప సోమకులగోత్రాధీశ్వరుల్ జోగులై
భూమల్ దామును బాములన్ వెదకఁగా బాతాళమున్ దూఱితిన్. 7

సాహిణి మారన దాతగఁ బ్రసిద్ధుఁడు. ఈతఁడు ముప్పదియిద్దఱు మంత్రులలో నొక్కఁడుగాఁ జేర్కొనఁబడి భాస్కరరామాయణ కృతిపతిగాఁ జెప్పఁబడెను. అది యెంతవఱకు యథార్థమో తెలియదు. ఆయన యీవినిఁ దెలుపున దీ పద్యము.

క. అప్పు లిడునతఁడు ఘనుఁడా!
అప్పు డొసఁగి మరలఁ గాంచు నాతఁడు రాజా!
చెప్పఁగవలె సాహిణి మా
రప్పను దానమున ఘనుఁడు రాజు నటంచున్. 8

1 అర్థాదులు :- (1) చంద్రభూష క్రియా శక్తిరాయలు = చంద్రభూషక్రియాశక్తియను పీఠాధిపతిప్రాపుననున్న ప్రౌఢదేవరాయలు. (2) సైకతము = ఇసుక. అరాతి = పగవాఁడు. (3) బయసి = గౌరవము. (4) గొడ్డు + ఏతి = గుత్తకుఁగొని. (6) వాహినీ రాజు = నదీ నాథుఁడు (సముద్రుఁడు) (7) సోమకుల గోత్రాధీశ్వరులు = చంద్రవంశపు రాజులు. రోగి (వి) శోగి. (8) అప్పులు (నానా) ఉదకము, ఋణములు. ఘనుఁడు (నానా) గొప్పవాఁడు, మేఘుఁడు. రాజు (నానా) ప్రభువు, చంద్రుఁడు.

2. ప్రశ్నలు:-

1 శ్రీనాథుఁ డవసానకాలమం దెట్టి బాధపడెను ?
2. రావుసింగ మహీపాలునిఁ గూర్చి శేష - నారదుల కైన సంభాషణమును వివరించినది.

3 రచన :—మీచదివిన చాటువుల నాధారముగాఁ జేసికొని శ్రీనాథుని గొప్పతనమును వివరింపునది.

4. వ్యాకరణాంశములు :—(1) ఆంధ్రభావ - ధీవిశాలుఁడు - వెదురుగొడియ - అమరపురి - గోత్రాధీశ్వరులు - ఈ సమాసములను గ్రహింపునది. (2) టంకాలక్ - ముత్యాలశాల - మోసపోతి - దినవెచ్చము. వీనియందలి వ్యాకరణ కార్యములను గ్రహింపునది. (3) ముత్యము - రాతిరి - గుణము - మఖము - జోగులు - శ్రీ. వీనికిఁ బ్రకృతి వికృతులను దెలిపునది.

# ౫. క్రుద్ధముని

## శ్రీ శివశంకర శాస్త్రి గారు

ఈ గీతసంవాదము తల్లావఝ్ఝల శివ శంకరశాస్త్రి గారి రచనలలో నొకటి. ఇది శ్రీవారి షష్టిపూర్తి సంపుటమందలి చతుర్థ కదంబము నుండి గ్రహింపఁ బడినది.

శాస్త్రిగారు బహుశాస్త్రకోవిదులు; రసస్వరూపులు. వీరి రచన లన్నియు మృదుమధురములై యుండును. వీరు సాహితీసమితి కధ్యక్షులుగానుండి యాంధ్ర సారస్వతమునకు నూతన వికాసమును గలిగించిరి.

### జమదగ్ని

ఎరుక కలదె నీకు ఎంత ప్రొద్దెక్కెనో?
ఎపుడు వెడలిపోతి వింటినుండి!
అడుగులోన నడుగు నిడుకొంచు కూర్మంబు
వరుస మందగతిని వచ్చినావు. 1

గృహిణి వైనదాన వహరహమ్ము సమస్త
విధులు నియత మైన వేళలందె
చక్క బెట్టుచుందు, వక్కజమ్ముగ నేడు
ఏల చేసినావొ యింతజాగు? 2

హోమవేళ దాటె నీ మూలమున, నేను
ప్రత్యవాయ మయ్యె భ్రష్టురాల!
సాధ్వసంబు జూడ సంశయంబు జనించు,
నిజము తెలుపకున్న నిగ్రహింతు! 3

### రేణుక

కోపరక్తాక్షులను కనుంగొనుటవలన
కంప మొదవెను సర్వాంగకంబులందు
అంతియే కాని యేదోష మాచరింప
సంశయించుట తగదు నిష్కారణముగ. 4

జ మ ద గ్ని

హోమవేళ దాటు టోసి, యెరుంగక
సిగ్గు విడిచి యెదురు చెప్పె దేమి ?
సాధ్వి కర్హమగునె సాహసవాక్యమ్ము ?
ఎందువలన నయ్యె నింత జాగు ? 5

రే ణు క

ఘట్టమున కేగి గంగోదకమ్మునందు
కలశమును ముంచి పూరించి కదలువేళ
శ్రవణగోచరమయ్యె నుత్సాహ భరిత
మంజులరవంబు వాహినీమధ్యమందు. 6
అపుడు సంజాత కౌతుకాయత్తచిత్త
నగుచు కనుదోయి బరవ బ్రత్యక్ష మయ్యె
వీచికలలోన లోచనరోచనముగ
క్రీడ సల్పెడి యప్సరః స్త్రీగణంబు. 7
అచ్చరల పిండు వారివిహారలీల
నంత కంతకు నాదెస కరుగుదేర
కానవచ్చెను కామినీ గణములోన
మోహనాంగుడు గంధర్వమూర్తి యొకడు. 8
రమణు లందరు నా కదూరమ్ములోన
ఆ మనోహరమూర్తితో నంబుకేళి
సలిపి తద్దివ్యకంఠదేశమ్మునందు
విప్ప నంభోజదామమ్ము వేసినారు. 9
ఆ యపూర్వ విహారమ్మునందు మనసు
తగిలి యుండుటచే కొంతతడవు చనియె.
మరల నెన్నడు నాకు మైమరపు రాదు,
ఈ చరణదాసి నిపుడు క్షమింప దగును. 10

## జ మ ద గ్ని

ముజ్జగమ్ములందు లజ్జావిహీనురా
లింతకంటె గలదె యెవతె యేని!
బ్రాహ్మణోత్తమునకు భార్యవైనట్టి నీ
వెట్లు చూచుచుంటి వితరపురుషు? 11
భార్య కెపుడు భర్త పరదైవతంబను
ధర్మవాక్కు మరపు తగిలె నోసి!
పరమపూత మైన భార్గవాన్వయ కీర్తి
పాడుచేసినావు భ్రష్టురాల! 12
ఇట్టి యాడుదాని నెట్టు క్షమింతును!
ఒడలు మండిపోవుచున్న దోసి!
పోయి పడుము వేగ పుణ్యభాగీరథీ
తోయముల నఘంబు తొలగిపోవ! 13

## రే ణు క

ప్రాణములు పోవునని నాకు భయములేదు
కాని, సాధ్విని పుత్త్రుల గన్నదాని
వయసు దాటినదాని నీ వరుస, మీరు
తపసు లయ్యును దూషింప ధర్మమగునె? 14
పాప మొనరించుచో శిక్ష భావ్య మగును:
కొద్ది జాగయ్యె నని మహాక్రోధ మూని
అనపరాధినిపై నింత యఘము మోపి
మనసు చిల్లులు పడిపోవు మాట లనుచు— 15

## జ మ ద గ్ని

నోరు మూసికొనవె యూరక ప్రేలక!
ఒకని జూడవచ్చు నొక్కసారి
మరల జూచునెడల మనసులో తాత్కాలి
కానురాగ మున్నదనుట ధ్రువము. 16

### రేణుక

ఎంత విపరీత సిద్ధాంత మిది మహాత్మ!
ఏండ్లు దాటిన బ్రాహ్మణి కేమి రక్తి?
వేడుక జనించినది జలక్రీడ జూడ:
అన్యభావము లేదు నా కంతకన్న. 17

### జమదగ్ని

భార్గవాన్వయమ్ము బహుకాలమందుండి
నిష్కలంక కీర్తి నెగడుచున్న,
దట్టిదాని నిప్పు డలమె కలంకంబు—
నిజకుల ప్రతిష్ఠ నిలుపవలయు. 18
వసు, మనాదులార, వైళంబ చనుదెంచి
మత్త దీని జావ మొత్తు డోరి!—
ఊరకుందు రేమి భీరువులార, స్త్రీ
హననఫలము మిమ్ము నంట బోదు. 19
చెప్పినట్టి పనిని చేయరా యేమిరా!
తండ్రిమాట వినని తనయు లేల?
వరుస వీరి నెల్ల వధియింప నేతెమ్ము
ప్రమథనాథ శిష్య, పరశురామ! 20

1. అర్థాదులు:– (2) అహరహమ్ము = ప్రతిదినము. ప్రత్యవాయము= పాపము. సాధ్వసము = భయము. (5) ఘట్టము = రేవు. (7) వీచికలు = అలలు (8) పిండు = సమూహము. (19) వైళంబు+ అ = శీఘ్రముగా. (20) ప్రమథ నాథశిష్య = ప్రమథులకు ప్రభువగు నీశ్వరుని శిష్యుఁడా!

ప్రశ్నలు:–

1. గంగోదకమున కేగిన రేణుక యేల ఆలసించెను?
2. జమదగ్ని రేణుకపై నేమని కోపించెను?
3. రేణుక తాను నిరపరాధినని యెట్లు చెప్పెను?

4. "పరమపూతమైన భార్గవాన్వయ కీర్తి పాడుచేసినావు" ఎవ్వరు ? ఎట్లు ?
5. "ఎంత విపరీత సిద్ధాంత మిది మహాత్మా" ఆ సిద్ధాంత మేది?

**3.** రచన:- (1) రేణుకా జమదగ్నుల సంభాషణమును సొంతమాటలతో వ్రాయునది. (2) అడుగులో నడుగు నిరాకారము - ప్రత్యాహారము - సాధ్వసము- వీనిని వాక్యములందు గూర్చునది.

4. వ్యాకరణాంశములు:- (1) ముజ్జగములు - లజ్జావిహీనురాలు - కనుదోయి - అహరహమ్ము. ఇవి యే సమాసములో గ్రహించునది.

(2) రోషము - లజ్జ - కీర్తి - భీరువు - స్త్రీ - వీనికి వికృతులను గ్రహించునది.

# ౬. దీనబాంధవులు

## శ్రీ లక్ష్మీకాంత వేంకటేశ్వర కవులు

ఈ భాగము సౌందర నందము నందలి నవమసర్గ లోనిది. సౌందర నందము సుందరీనందుల ప్రేమ స్వరూపమును, వైరాగ్యస్వరూపమును జిత్రించిన యుత్తమ కావ్యము.

ఈ కావ్యమును శ్రీ పింగళి లక్ష్మీకాంతము (ఎం.ఏ.) గారును, శ్రీ కాటూరి వేంకటేశ్వరరావు గారును రచించిరి. వీ రాధునిక కవులలో నగ్రశ్రేణికిఁ జెందిన వారు. వీరిలోఁ బ్రథము లాంధ్ర విశ్వకళాపరిషత్తునం దాంధ్రశాఖకు నధ్యక్షులుగా నుండి ప్రస్తుతము విజయవాడలోని రేడియోనిలయమున నాంధ్రశాఖా సమీక్షకులుగా నున్నారు. ద్వితీయులు పెద్దకాలము మచిలీపట్టణము నందలి జాతీయ కళాశాల కధ్యక్షులుగను, కొంతకాలము కృష్ణాపత్రికకు సంపాదకులుగను నుండిరి.

నందనుఁడు బుద్ధుని సోదరుడు. ఈతఁడు బుద్ధదేవుని యానతిచే బౌద్ధ ధర్మమును బూనెను. అతని యర్ధాంగి యగు సుందరి కొంతకాలము తన నాథునికై వగచి తుద కామెయు బౌద్ధదీక్ష బూనెను.

సుందరి దీనజనసేవ యొనరించుచు నొకనాఁడు పల్లెవాడలోని యొక యనాథ కుటుంబమును సేవింపఁ బోవును. ఆమె యేగునప్పటికే భిక్షుక రూపమున నున్న నందుఁడు నచట నుండెను. అనాథ యువతి తనబిడ్డలను వారి చేతులలో నిడి తుది యూర్పు విడిచెను. ఇది ప్రకృతి కథ.

గీ. దినదినము నా దయామయి దీనజనులఁ
బిలువనంపించి యిలువేలుపులకుఁ బోలె
భక్తిమై నర్చ లొసఁగి యాభరణరాజిఁ
బంచి యిచ్చును బ్రీతిసంభావముల. 1

* సీ. విడుదులుగావించు వీథులఁ దిరుగు గో
శ్వానమ్ములకు గృహోద్యానమందు
నింటింట బిచ్చమునెత్తు పంగ్వంధుల
రావించి తన మందిరమున నిల్పఁ
బథ్యపానము లంపు జ్వరితుల, కెపరించి
వెజ్జుల వ్రణితుల వెతలు మాన్పు
మృత్యువు సొచ్చిన గృహము లదృష్టదే
వతవోలెఁ జొచ్చి దుఃఖితుల నోము

గీ. నాఁడు నాఁటికి గేహ మనాథబాల
కులకు విద్యాలయమ్ము, రుగ్ణులకు వైద్య
శాలయై, ధర్మదేవత కాలయమ్ము
నగుచుఁ దా నందుఁ బూజరి యయ్యె సబల. 2

* గీ. 'హో' యనెడు పిల్పు వీతేర, 'నో' యటంచు
నుట్టిపడు స్థూలదేహమ్ము నుజ్జగించి,
యా తపస్విని, శబ్దమాత్రానుమేయ
తనుతరాకృతి దాల్చు భూతదయవోలె. 3

క. ఒకనాఁటి సందెచీఁకటి
మొకమున నాయమ గృహాభిముఖియై చనుచో
వెకివెక్కి యేడ్చుచున్ బా
లకుఁ డొక్కరుఁ డడ్డమై నిలఁబడి త్రోవన్. 4

క. తను గాంచినంతనే గ్ర
క్కునఁ జేరఁగవచ్చి కావికోంగు కరమునన్
గొని లాగుచు వెన్కకు ర
మ్మనుచున్ జేసాఁపి చూప నాయమ కరణన్. 5

క. ఒక కేల కనులు నులుముచు
నొక కేలన్ దన్ను లాగుచుండిన యా బా
లకు చుంచుదువ్వి "శోకిం
పకు మన్నా! యేను వెంటవచ్చెద" ననుచున్. 6

గీ. దీపికోజ్జ్వల విపణివీథిం దరించి
ధనికులు వసించువాడలు దాఁటి, యంతఁ
గారుచీఁకట్లఁ దేలు కుటీరపాళి
లోన దుర్గంధిలపు సందులోనఁ జనుచు. 7

*చ. చితచితలాడు నీరమునఁ జేఁపలకంపునఁ, బందిముట్టియల్
కతికెడి చప్పరింపులను, గ్గె కుయిలాడెడి కుక్కకూఁతలన్

ప్రతినినదించు దర్దురరవమ్ముల, నీదర స్రోతలన్, దరి
ద్రత తలపేలు గ్రుక్కికొను తావులలో వెలివాడ చక్కటిన్. 8

క. ఒక గుడిసెలోనికిన్ బా
లకు వెంటంజొచ్చి, తైలలవపుష్టమ్మా
మకమకని దివ్వె వెలుఁగున
నొకట సమాసన్న మరణ నువిదన్ గాంచెన్. 9

ఉ. కావులు గట్టియున్ దరుణకంజహితుం బురుడించువాని, దుః
ఖావిల నొక్క బాలను దయామతి నక్కునఁజేర్చి ముంగురుల్
ప్రోవిడి ముద్దుగొం చవలి మోమయి నిల్చినవాని, భిక్షు న
ప్పావని గాంచి "బుద్ధభగవానుఁడగున్ శరణమ్ము మా" కనెన్. 10

ఉ. ఆ పలుకాలకించి యతఁ డాయమఁ గన్గొనెఁ, గాంచె వాని మో
మాపె, పురః ప్రసారితములైన కరమ్ముల నారవిచ్చు నా
సా పుట నేత్రయుగ్మములఁ జయ్యల నొండొరు డాయఁబోవు వా
రై పదయుగ్మమెత్తియును 'హా' యని నిల్చిరహా! తటాలునన్. 11

న. అనిలవశమ్మున్ క్షుభిత మయ్యును వెండియు నంతలోన శాం
తిని గొని కల్త దేఱి ప్రకృతిస్థలములైన కొలంకులట్లు నె
మ్మనములు దేఱఁ, జూపులను మూఁటిన మబ్బు తెరల్ తమంత నం
తన వెడలన్ బ్రసన్ను లయి నందుఁడు, సుందరి యల్ల నల్లనన్. 12

* గీ. 'ప్రాణమా' యనుచు నొండొరుఁ బల్కరింప
సాఁగి 'ప్రా' మాత్ర పర్యవసన్నములగు
నెలుఁగులు గళమ్ముఁ దగులఁ దా మెట్టకేని
యనిరి 'గచ్ఛామి బుద్ధం శరణ' మటంచు. 13

గీ. పిదప మంచములోని యా పేదరాలిఁ
గాంచి, చెఱియొకదెస నిల్వఁ గాలమహిమ
ఘంటికానాదములు వీనుఁగవ నదించు
నాపె కనువిచ్చి నలుదెస లరసికొనుచు. 14

ఆ. చెంత నిల్చియున్న చిన్న నిసుంగులఁ
జేరదీసి నందు చేతియందు,
గూఁతు హస్తమిడియెఁ, గొమరుని హస్తమ్ము
సుందరీకరమ్ము నందు నిడియె. 15

ఉ. పిమ్మట వారిహస్తములు, బిడ్డలపాణియుగమ్ము లాత్మహ
స్తముల నూఁది, కన్గొనల జాఱుముదశ్రులతోడ దీర్ఘ దీ
ర్ఘమ్ముగ నిశ్వసించుచు సుఖమ్మమెయిన్ గనుమోడ్చె, నంతలో
సమ్ముఖమందు నిల్చె భవసాగరపోతము గౌతమర్షియున్. 16

**1. అర్థాదులు:-** (2) పంగు + అంధులు = పంగ్వంధులు = కుంటివారు, గ్రుడ్డివారును. వ్రణితులు = గాయములు తగిలినవారు. రుగ్ణులు = రోగులు. (6) వంచము దువ్వి = బుగ్గలుసవరించి. (7) విపణివీథి = దుకాణముల బజారు. (8) దర్దుర-రవము = కప్పల-యరపు ఈఁదర = చలిగాలి. (9) తైలలవపుష్టమ్ము = కొద్దిచమురుతోఁ బోషింపఁబడునది (కొలఁదిగానున్న నూనెతో వెలుఁగుచున్నది.) (13) ప్రామాత్ర పర్యవసనమ్ములు = 'ప్రా' యను నక్షరముతోడనే ముగిసినవి. (14) కాల-మహిష-ఘంటికా-నినాదములు = యముని-దున్నపోతు-చిఱుగంటల-ధ్వనులు. (16) భవ-సాగర-పోతము = సంసారమను సముద్రమును దాఁటించు - పడవ.

**2. ప్రశ్నలు:-**

1. సుందరి మందిర మెవ్వరెవ్వరి కెట్లుండును ?
2. సుందరి దీనజనసేవ నెట్లు చేయుచుండెను ?
3. సుందరి చేరిన వెలివాడ యెట్లుండెను ?
4. "భిక్షు నప్పావని కాంచి" చూచిన దెవరు ? ఆ భిక్షుకుఁ డెటుండెను ?
5. "ఆపె కనువిచ్చి నలుదెస లరసికొనుచు" కనువిచ్చి చూచిన దెవరు ? ఏల కనువిప్పెను ? విప్పియేమిచేసెను ?
6. "సుఖమ్మమెయిన్ గనుమోడ్చె" ఎవరు ? అంతటి సుఖ మేల కలిగెను ?

**3. రచన:-** (1) సుందరి వెలివాడ కేగి యనాథ కుటుంబము నాదరించిన విధమును రెండురంగముల నాటకభాగముగాఁ జిత్రించునది. (2) 'మృత్యువు' సొచ్చిన గృహము, సందెచీఁకటి మొకము, ఉట్టిపడు.' వీని యర్థము చక్కఁగా స్ఫురించునటుల వాక్యనిర్మాణము చేయునది.

**4. వ్యాకరణాంశములు:-** బిచ్చము, - వెజ్జు - మత్యువు - స్థూలము - కుక్క - ఘంటిక - వీధి. వీనిలోఁ బ్రకృతులకు వికృతులు, వికృతులకుఁ బ్రకృతులు గ్రహించునది.

---

# ౭. హాలికుఁడు

## కవికోకిల దువ్వూరి రామిరెడ్డిగారు

రామిరెడ్డిగారి రచనలలో నాయకరత్నము 'కృషీవలుఁడు.' ఆ మధుర కావ్యము లోని దీ పద్యభాగము. వీరి కర్షకపక్షపాత మీ కావ్యమున వ్యక్తమగును.

రామిరెడ్డిగారు తెలుఁగు సారస్వతారామములలో మధురగీతికల నాలపించి రసికులకుఁ గర్ణరసాయనము గూర్చిన కవికోకిల. వీరు సంస్కృతాంధ్రములు, ఇంగ్లీషు, ఫ్రెంచి, జర్మన్, బెంగాలీ, పర్షియన్ మున్నగు పెక్కుభాషల నేర్చినవారు. "వీరి కవిత్వము ప్రాఁత క్రొత్తలకు, ప్రాక్పశ్చిమాల మేలికలయికగా అందాల అలవరచు కొన్నది." నలజారమ్మ, వనకుమారి, జలదాంగన, పానశాల, గులాబితోఁట, నైవేద్యము, భగ్నహృదయము, మీరాబాయి మున్నగు పెక్కు మధుర కావ్యములు వీరి లేఖినినుండి జాలువారినవి.

కవికోకిల కళాక్షేత్రము నెల్లూరు. జీవితము 1895 - 1947 ల మధ్య గడచిపోయెను.

* శా. అన్నా హాలిక! నీదుజీవితము నెయ్యంబార వర్ణింప మే
కొన్న న్నిర్ఝరసారవేగమున వాక్పూరంబు మాధుర్య సం
పన్నంబై ప్రవహించుఁగాని యితరుల్ భగ్నాశులై యీర్ష్యతో
నన్నుం గర్షక పక్షపాతి యని నిందావాక్యము ల్వల్కరే! 1

*చ. వనలతయైన నా కవిత పత్రపుటంబులఁ బూవురెమ్మలన్
దినదిన జృంభమాణయయి తేజరిలెన్ సహజప్రరోహ వ
ర్ధన నియమానుసారముగఁ; దల్లత యెన్నఁడు దోఁటమాలి పా
ణిని గనుఁగొని వన్యరమణీయతఁ జిల్కు నపూర్వపద్ధతిన్. 2

తే. పంజరనిబద్ధకీరంబు బయలు గాంచి
యడ్డు కమ్ముల దాఁటంగ నాసచేయు
నటు, బహిర్ణియమంబుల నతకరించి
మన్మనంబు స్వాతంత్ర్య సీమకుఁ జరించు. 3

తే. కాన, యెవరేమి యనుకొన్న దాన నేమి
గలుగుఁ? గాల మనంతము; ఇల విశాల;

భావలోకము క్రమముగాఁ బడయు మార్పు
ఏల హృదయంబు వెలిపుచ్చ నింతయళుకు ? 4

తే. సైరికా, నీవు భారతమ్మాతలాత్మ
గౌరవ పవిత్రమూర్తివి! శూరమణివి!
ధారుణీపతి పాలనదండ మెపుడు
నీ హాలంబు కన్నను బ్రార్థనీయ మగునె ? 5

తే. దైనికావశ్యకమ్ముల దాఁటిపోవ
నెగుర ఱెక్కలురాని నీ యిచ్ఛలెపుడుఁ;
బైరుపచ్చలె యవధిగాఁ బ్రాకుచుండు
నీ విచారము, నూహయు, నిపుణతయును. 6

తే. ప్రొద్దు వాడిచిన దాదిగాఁ బ్రొద్దు గ్రుంకు
వఱకుఁ గష్టింతువేగాని యిరుగు పొరుగు
వారి సంపదకై యాసఁ గూరఁ బోవ
వెంత నిర్మలమోయి, నీ హృదయ కళిక !

* తే. పల్లె యెల్లయె సర్వప్రపంచసీమ !
ప్రియ యొకర్తయె రమణీయ విగ్రహంబు!
బంగరుం బంటపొలములే భాగ్య నిధులు!
అనుదిన పరిశ్రమమె మతమగును నీకు! 8

తే. ఉండి తిన్నను లేక పస్తున్నఁగాని
యాసచేయవు పరుల కష్టార్జితంబు !
నాఁక లెత్తఁగ నీ పంచ కరుగు నతిథి
తినక, త్రావక పోయిన దినము లేదు. 9

తే. కృషి సకల పరిశ్రమలకుఁ గీలుచీల;
సత్పరిశ్రమ వాణిజ్యసాధనంబు;
అఖిలవాణిజ్యములు సిరి కాటపట్లు;
సిరియె భోగోపలబ్ధికి జీవగఱ్ఱ. 10

తే. కావునఁ గృషీవలా, నీవె కారణమవు
సాంఘికోత్కృష్ట సౌభాగ్య సౌఖ్యములకు;
ఫల మనుభవించువారలు పరులు ; నీకుఁ
గట్టఁ గుడువను గఱవె యెక్కాలమందు !

*మ. ఫలము ల్మెక్కెడివారు తత్ఫలరసాస్వాద క్రియాలోలురై
పలుమా రమ్మధురత్వము న్నుతుల సంభావింతురేగాని, త
త్ఫల హేతుక్రమ వృక్షముం దలఁప రెవ్వారైన, నట్లే రమా
కలితు ల్భోగములన్ భుజించుచు నినుం గన్నెత్తియుంజూతురే! 12

ఉ. అట్టి కృతఘ్నులన్ మనమునందుఁ దలంపక సేద్యనాద్యవున్
ఘట్టన నస్థిపంజరముగాఁ దనువెండినఁగాని వర్షముల్
పట్టినఁగాని, క్షామములు వచ్చినఁగాని శరీరసత్వమే
పట్టుగ స్వశ్రమార్జితము పట్టెఁడు నన్నముఁ దింద వెప్పుడున్ ! 13

తే. రాజకీయ ప్రపంచ సామ్రాజ్యమందు
శౌర్యఖడ్గంబులకు లేదు శాసనంబు;
సంఘరాజ్యంబు నేలు విస్తారశక్తి
సతము నాచార ఘోరపిశాచరాజు. 14

తే. శౌర్యమునకును నాచార చక్రమునకు
మధ్య — లోకంబు దవిలి సమ్మథిత మగును;
కాలగర్భంబునం దెట్టి ఘటన గలదొ
పూర్వపద్ధతి విప్లవ స్ఫురణఁ గొలుప ! 15

తే. కల్యకాంతికి మున్నంధకార రాత్రి,
వర్షపాతంబునకు మున్ను వారిదముల
ఘమఘమాడంబరములు నమరు; నిదియుఁ
బ్రకృతి భావంబునకు నూత్న పథము గాదు. 16

తే. కష్టసుఖముల నీచోచ్చగతులు గలవు
చక్రదండంబులకుఁబోలె; సమయమందు

నిట్టి మార్పు లనంతమై యొసఁగుచుండు
భావి పరిణామ మెవ్వరు పలుకఁ గలరు ? 17

తే. ఓ కృషీవల ! నీవు కష్టోత్కటంపు
దుర్భరావస్థయందె తోఁదోపువడఁగ
నెవరు శాసించువారు, నీకేమి కొదువ ?
ఆత్మవిజ్ఞాన మయముగా నలవరింపు. 18

శా. దారిద్ర్యంబను పెల్లుఁ బేటి కెదురై దాఁటఁ బ్రయత్నించుచుం
బూరావేగమునం జలించి వెనుత్రోపుం గొన్నఁ గాంక్షోదుపం
బేరాపొందక నెట్లు తెప్పగు మన స్వేచ్ఛాప్రకారంబుఁ గా
ర్యారంభంబును ధైర్యము న్విడకు మయ్యా, నీవు వేయింటికిన్. 19

తే. రార సైరిక, కనుఁగొమ్ము రమ్యమైన
సస్యకేదార ఖండంబు ! సత్కవీశ
భావలోచన మెరవుగాఁ బడయకున్నఁ
గాంచనేర వంతర్లీన కాంతిసరణి. 20

*మ. అనిలాలోలవినీలసస్యములు భంగానీకముల్గాఁగఁ దె
ల్లని కొంగ ల్పయిఁ దేలు నురువులుగ లీలన్ టెక్కలల్లార్ప, మ
ధ్యను రాజిల్లు కుజంబు లోడలుగ వాతస్ఫూర్తిఁ గంపింప, స
స్య నికాయావని సాగరంబటుల నేత్రానందముం గూర్చెడిన్. 21

*చ. కుసుమలతావళీ వలిత కుంజములం, గిసల ప్రకాండముల్
పసరులు గ్రక్కు వృక్షముల బాలతృణంబులఁ జేలగట్లు సొం
పెసఁగ, సమస్తరత్నముల నేరిచి కూర్చిన జాలబిల్లలన్
వసుధ కమర్చిరో కృషికవర్యులనన్ వరిమళ్ళు శోభిలున్. 22

చ. మరకత చూర్ణవర్ణముల మండితమౌ నవశాలిభూమి సుం
దరతను గాంచ వైదిక దినంబులలో భరతక్షమాధురం
ధరయగు సస్యలక్ష్మి దయదప్పక నేఁటికి నార్యధారుణీ
భరణ కుతూహల స్ఫురణ భాసిలునో యన నొప్పు హాలికా ! 23

తే. కడ మొదలులేని నీ దేహకష్టములకుఁ
ప్రతిఫలంబగు సస్యసంపత్తి గాంచి
కవివి గాకున్న వాగ్మిత గలుగకున్నఁ
బ్రణుతి సల్పెంపు మొకసారి భాగ్యగరిమ! 24

1. అర్థాదులు:- (1) హాలికుఁడు (వ్యు) హలకర్మ సేయువాఁడు. (రైతు) నిగ్గరము=సెలయేఱు. (2) ప్రరోహము=మొలక. (3) కీరము=చిలుక. అతకరించి=క్రిందుపఱచి (6) అవధి=హద్దు. (7) కళిక=మొగ్గ. (16) వారిదములు (వ్యు) నీటి నిచ్చునవి. (మేఘములు) (17) చక్రదండంబులు=బండిచక్రపు ఆకులు (21) కుజము (వ్యు) భూమినుండి పుట్టునది. (చెట్టు) (23) శాలిభూమి=వరిపైరుగల నేల. (24) వాగ్మి=మాటలనేర్పు కలవాఁడు.

2. ప్రశ్నలు :-

1. ఈ రచన సల్పిన కవి హృదయ మెట్టిది ?

2 హాలికుని హృదయ మెట్టిది ?

3. హాలికుఁడు దేశమునకుఁ జేయు మేలేమి ?

4. కర్షకుఁ డొనరించు నతిథిసేవ యెట్టిది ?

రచన :- (1) సస్యశ్యామల మగు క్షేత్రము నొకదానిని వర్ణించునది.
(2) భారతభూమి యందు హాలికునకుఁ గల స్థానమును నిరూపించునది.

4. వ్యాకరణాంశములు :- (1) తల్లత - మన్ననంబు - సత్పరిశ్రమ - స్వశ్రమార్జితము - సమ్మదితము - అంతర్లీన కాంతి. ఈ సంధులను విడఁదీసి వాని యందలి విశేషములను గ్రహించునది. (2) కార్యారంభము - సమస్త రత్నములు - సస్యశ్యామలము - పవిత్రమూర్తిని. ఇవి యే సమాసములలో గ్రహించునది. (3) "దారిద్ర్యంబను వెల్లువేటి కెదురై దాఁటం బ్రయత్నించుచున్" ఇది యే పద్యపాదమో గ్రహించి గణవిభజన మొనరించునది.

# ఐదవ ఫారము

## సామాన్య పఠనము

### గద్య భాగము

## ౧. వంచకుల దౌష్ట్యము

(శ్రీ) కందుకూరి వీరేశలింగము పంతులుగారు (సంధి-నీతిచంద్రిక)

ఈ పఠనీయము నీతిచంద్రిక యందలి సంధినుండి గ్రహింపఁబడినది. అందు మేఘవర్ణుఁడు చిత్రవర్ణునితో నీ కథ చెప్పెను.

నీతిచంద్రిక యందలి సంధి భాగమును రచించినది శ్రీ కందుకూరి వీరేశలింగము పంతులుగారు. పంతులుగారు 1847 ప్రాంతమున జన్మించి 1919 సంవత్సరమున దివంగతులైరి. పంతులుగారి సంఘసేవయు, దేశసేవయు, భాషాసేవయు అనన్య సామాన్యములు.

వీరికి గద్యతిక్కన యను బిరుదము గలదు.

ఆంధ్రకవుల చరిత్ర, శాకుంతల నాటకము, రాజశేఖర చరిత్రము, రసికజన మనోరంజనము, స్వీయచరిత్ర, భారత సంగ్రహము, ఉత్తర రామాయణము, నీతి దీపిక మొదలగునవి వీరి యితర గ్రంథములు.

వీరి రచన మృదుమధురమై నాతి కఠినమై యుండును. స్పష్టత సర్వత్ర ప్రకాశించుచుండును. వీరి శైలి పండిత పామర మనోరంజనముగా నుండును. వీరి రచనలలో సర్వత్ర తెలుగుఁదనము తాండవించుచుండును.

వీరి రచనాలక్ష్యము విద్యావ్యాప్తి, పండిత పామరుల నాకర్షించు సులభశైలి, సంఘ సంస్కరణము.

గమనిక : ప్రకృత పఠనీయము గ్రహింపబడిన నీతిచంద్రిక యనఁగా నీతికి వెన్నెలవంటిదని భావము. పంచతంత్ర హితోపదేశము (సంస్కృత)లను గ్రంథముల నాధారముగాఁ గొని, కొన్ని యభినవంబులను జేర్చి చిన్నయసూరి నాలుగంశములుగల నీతిచంద్రికను రచింపఁ బ్రారంభించె. కారణాంతరములచే మిత్రలాభము, మిత్రభేదము అను రెండంశములను మాత్రమె రచింపగల్గె. సంధి విగ్రహములను రెండంశములను కందుకూరి వీరేశలింగము పంతులుగారు రచించిరి. కొక్కొండ వెంకటరత్నము పంతులుగారును రచించిరి.

ప్రకృత పఠనీయము కం. వీరేశలింగము పంతులుగారు రచించిన సంధి యంశమునుండి గ్రహింపఁబడినది.

బ్రాహ్మణుఁడు పరమ ఛాందసుఁడొకఁడు తన యధ్వరార్థంబు నల్లమేక నొకదానిం గొని మెడకుఁ బగ్గమగ్గలముగా బిగించి మించు

వేడుకతోడ నింటికిఁ దీసుకొని పోవుచుండెను త్రోవలో నొక చెఱువు గట్టు మీఁదఁ గూర్చుండి చూచి దుర్ణయంబునఁ గొందఱు దుర్మార్గు లా యజంబును గాఁజేయవలెనని తలంచి తమలోఁ దామిట్లు చింతించిరి: ఈ ధరామరుండదె బలిసిన మేఁకపోతుం గొనిపోవుచున్న వాఁడు. ఒక్క నిష్కమిచ్చి కొంద మన్నను మన కిట్టి క్రొవ్వినది సాధారణముగా దొరకదు ఈ వైదిక శిఖామణి నేలాగునైన వంచించి యా ఛాగంబు నిప్పు డపహరించితిమేని, వారము దినములు వఱకుఁ బుష్కలముగా మన మనస్యాపేక్షంబుగ మాంస భక్షణంబు సేయవచ్చును. అనునెడ నొక ధూర్తుఁడు నడుమ నడ్డమువచ్చి యిట్లనియె. ఈ బ్రాహ్మణుఁడు పిశాచమువలెఁ బట్టుకొని యేమఱక యీ మేఁక గొంతున కురిపోసి ధరా పరాగంబు రేఁగ లాఁగుకొని పోవుచుండఁ బట్టపగలు నట్ట నడు వీధిలో మనమెట్లు దీని నెత్తుకొనిపోయి ప్రజల కన్నులు గప్పఁగలము? రాజభటులును భయంకరులయి యమకింకరుల వలె దండహస్తులై యూరనెల్లడఁ దిరుగులాడుచున్నారు. మనల నొకవేళ దొంగలమని పట్టుకొనిపోయి చండశాసనుఁడగు రాజు నెదుర౦బెట్టినఁ గ్రూరశిక్షకుం గుఱికావలసి వచ్చును. దైవమిచ్చిన మాత్రము సుఖముగఁ గుడిచి గూర్చుండలేక తలక్రొవ్వి యకార్య కరణంబునకుం జొచ్చితిమేని మనకందఱకు నేక కాలంబునఁ గాలంబు చేరువగును ఈ వ్యర్థ ప్రయత్నముచే మన కవమానం బగుట దక్క నభిమత కార్యసిద్ధి యొదవ నేరదు. నాబుద్ధివిని యింక నీప్రయత్నంబు మానుఁడు" అనినం బక పక నవ్వి, బాల్యమునుండియు మోసపుఁబనుల నాఱితేఱిన యొకవృద్ధ వంచకుం డిట్లనియె: నీకు లోకానుభవంబు చాలమింజేసి బేలతనంబున బాలవాక్యంబులు పలుకుచున్నాఁడవు. నిజముగా నా వంటి ప్రౌఢుఁడు దలఁచుకొన్న నీ యల్పకార్యంబు సాధించుట యెంతపని? ఫాలాక్షు నైనను మోసపుచ్చి యభిమతంబు తుదముట్టింతును. చూడుమే నిదె నీవు చూచుచుండ నా శక్తిచేత నీ మేఁకపోతును గుక్కను జేసి తీసి కొనివచ్చి మీ కందఱకుఁ గాంక్షలు దీఱ దీని మాంసంబున విందుచేసి మీ చేత నిప్పుడె మెప్పించు కొందును. తొల్లింటి కాలంబున నొక్క

మర్కటంబు మకరంబును మోసపుచ్చి కాదే తనప్రాణంబులఁ గాపాడు కొనెను. మీకక్కథ వక్కాణించెదఁ జక్కఁగా వినుండి.

పశ్చిమసముద్రతీరంబున నుండు నడవియందు బలవర్ధనుఁ డను ప్లవంగపుంగవుం డొకండు వసియించుచుండెను. అతండు వార్ధక్యంబున హీనసత్త్వుండగుట చూచి యాతని జ్ఞాతులు సర్వముం దోఁచుకొని యిల్లు వెడలనడచిరి బలవర్ధనుండును నడవులపాలయి పోయిపోయి, తపతీనదంబుతీరంబున ఫలభరితంబై యున్న యొక మేడిచెట్టు నాశ్రయించి, తత్ఫలాహారంబున శరీరధారణంబు గావించుకొనుచుండెను. ఇట్లు ఫలమాత్రమునఁ బ్రాణభరణము చేసికొనుచు నా యుదంబర వృక్షము మీఁదఁ జిరకాలము నిర్విచారముగానుండి, యొక్కనాఁడు పండ్లు దినుచుండ వలకేలం బట్టుకొన్న పండు ప్రమాదవశంబునఁ జాఱి నీరంబులం బడి బుడబుడశబ్దం బొక్కటి పుట్టెను. వానరమునకా నినదము శ్రవణానందముగా నున్నఁ దన మర్కటచేష్టలు బయల్పడ బలవర్ధనుండు వారిగ వారిలోపల ఫలములఁ బడవేయఁ జొచ్చెను. దైవవశంబున నావేళనె ఛాయకయి వచ్చి చెట్టుక్రింద నీడం బండుకొనియున్న క్రకచంబను మకరం బొకపండు కొని చప్పరించి జిహ్వాకింపుగా భక్షించి రుచిమరగి మఱియు నోరూర వానరము రాల్చు ఫలములనెల్ల మెల్ల మెల్లగా నాలుక త్రుప్పుడుల్ల నారగింపసాగెను. ఇట్లు ఫలాపేక్షం జేసి యా మొసలి మునలికోఁతితో మైత్రి చేసికొని, యిల్లును వాకిలియు మఱచి యాలుబిడ్డలం దలపెట్టక నెలలకొలంది నిచ్చటనే కాలక్షేపము చేయుచుండెను. అంత గృహంబున నాతని గృహిణి దుస్సహంబగు పతి విరహంబునకుం దాళఁజాలక పెనిమిటిం దలంచుకొని యహోరాత్రములు నేత్రముల నీరు సంతతధారగాఁ గార నేడ్చుచు, నొక్కదూతిం బిలిచి ప్రాణనాయకుని విలంబన కారణం బారసి యాతని సుఖవార్తను జెవుల వేసి మేనం బ్రాణంబుల నిలుపుమని బహువిధంబులం బ్రార్థించెను. ఆ దూతికయు నతిరయంబునం గదలి వెదకుచువచ్చి యా మేడిచెట్టు నీడను గోఁతితోఁ గూడనుండి వేడుకమాటలాడుచున్న క్రకచునిం జూచిపోయి, దీనాననంబుతో నా మానిని యడుగులం బడి, "మగువా!

నీమగఁ డొక కోఁతిముగుదం దగులుకొని మగుడనెలవునకు రాఁజాల
కున్నాఁడ"ని ఉన్నవికొన్నియు లేనివికొన్నియుఁ గల్పించి గ్రుడ్లనీరు
గ్రుక్కుకొనుచు వినిపించెను. పతి యొండొక సతిం దవిలియున్నాఁడన్న
పలుకులు ములుకులవలెఁ జెవిని బడినమాత్రమున నుల్లము ఝల్లన
నొల్లఁబోయి యల్లనఁ దెలివొంది యా మొసలి చెలువ చెలువుని నడతం
దడవి మనమెరియ వెచ్చ నూర్చుచుండెను. ఇచటఁ గ్రకచుండును
దూతిక యేతెంచి దవ్వుల న్మగుడిపోవుట దూరమున నుండి పొడగని
గుండెలు తటతటంగొట్టుకొన, నది సదనంబునకుం జని తనమీఁద గా
నితో నేమినేరములు జెప్పెనో యని యచట నిమిషమాత్రమైనం గాలు
నిలువక, వడివడి న్నంగడికాని వీడుకొని యింటికేగునప్పుడు శూన్య
హస్తముతోఁ బోఁగూడదని చేడియకు నూడిదగా నిడఁ గొన్ని మధుర
తర పరిపక్వఫలంబులం గొని హుటాహుటిం జనియెను. ఈలో నా
మకరాంగన తన చెలుల వలనం బతిరాక మాన్మొందమెఱిఁగి, చెలికత్తె
యలు నూరెలంజేరి విలపించుచుండ, మూసినకన్నులు తెఱవక పడి
యుండి మూలుగుచుండెను. క్రకచుండు దారం దారసించి కాంచి
హృదయంబుపగిలి, నోరుగద్గదికం దగులువడఁ బడఁతిం బిలచి యాలబ్ధ
ప్రతివచనుండయి, తత్తరంబున నిది యేమని చెలికత్తియల నడిగిన
నత్తరణు లిట్లనిరి. "నీవు వెనుకమఱచి, పోయినపోక గాఁబోయి యింటి
యొద్దఁ బెండ్లమేమయినను సరే యనుకొని నెలదినములనుండి బొత్తిగా
నిల్లుత్రొక్కి చూడకుంటివి. నీ వరిగిన మఱునటిదినము మొదలుకొని
నీ భార్యకుఁ దీఱని వ్యాధిపట్టుకొని దినక్రమమున రోగము ప్రబలి నేఁటి
యుదయమునుండి మాట పడిపోయినది. తెవులు కనఁబడినది మొదలు
కొని రాత్రియనక పగలనక తిరిగి, కన్నకన్నవారి కాళ్లెల్లం బట్టుకొని
సొమ్మునకు వెనుకముందులుచూడక మేము మాచేతనయినపని లోక
ములో లేని సిద్ధౌషధములనెల్ల నొకటికాదని యొకటిఁ బోయించితిమి
అఁడువార మింతకంటె నేమిచేయఁగలము? వేసినమందులెల్ల నేమూలఁ
బడుచున్నవో కాని లేశమయినను గుణమగపడలేదు. మందులు పోసి
పోసి విసిగి వైద్యులు చికిత్స యొకటి జెప్పిరి. "కోఁతి గుండెకాయ నే

యత్నముచేతనైనను సంపాదించి దానిని బాలతో నాలుగు దినములు
సాయంసమయమున సేవించుచువచ్చిన రోగము నిశ్శేషమయి యీ
ముదిత బ్రతుకఁగలదనియు, లేకున్న జీవితాశ వదలుకోవలసిన" దనియుఁ
దెలియఁజెప్పిరి. "చెడఁగాఁ జెడఁగా గాఁపురములు గావు, మేమి చెప్ప
వలసినది చెప్పితిమి ఇంక నేపాట్లుపడి వానరహృదయమును తెచ్చి
భార్యం బ్రతికించుకొనెదవో మీఁద నీ యిష్టము." అనినం గొంత
తడవు నిశ్చేష్టితుఁడయి వితాకుగదిరియుండి, యేమియుం బాలుపోక
యాకసంబువంకఁ దిలకించి పరిపరివిధంబులఁ జింతించి తలపంకించి,
యెట్లును బోకతీఱదని నిశ్చయించి, వారికడ నోరు మెదల్పలేక కదలి
చనుచు మార్గమున నిట్లు చింతించెను. "ఇంట భార్యను జూడఁ
బోయిన వచ్చెడు ప్రాణముతోను బోయెడుప్రాణముతోను నున్నది.
వైద్యులో యసాధ్యమయిన యౌషధముం జెప్పిరి. సాధ్యమయ్యెంబో
నెయ్యునిం బొలియించునంతటి పనిపుట్టును. బలవర్ధనుండు దక్క నాకు
మఱియొక్క కోఁతి యెక్కడఁ జిక్కును? వానరహృదయ మెత్తెఱం
గునఁ దెత్తును? లేక యీ యవస్థలోనున్న సన్నుతాంగి నెట్లు మందు
వేయక బలవంతముగాఁ జంపుకోనేర్తును! భార్యనిమిత్తము మిత్ర
ద్రోహము చేయుట తగవగునా? కాదని యొప్పరికించిన నిష్కారణ
ముగాఁ బండువంటి కాపురము కూలిపోవుచున్నది. మిత్రవధంబు దురి
తంబులలోనెల్ల దురితంబు. జాయ తన కాయంబులో నర్ధంబగుటంజేసి
యాలిం గోలుపోవుట యాత్మవధంబుకంటెను బాతకంబు. లోకములోఁ
దన్నుమాలిన ధర్మములేదుగదా? సూక్ష్మదృష్టిన్విచారింప మిత్రుని
ప్రాణంబులు గొనియైనఁ బ్రాణేశ్వరి ప్రాణత్రాణంబు గావించి యిల్లు
నిలువఁబెట్టుకొనుటయే యుచితము." అని కృతనిశ్చయుండయి పది
యడుగులు నడచి యంతటిపాపంబున కొడిగట్ట నొకపట్టున మనసొప్పక
డోలాందోళనంబునొందఁ గ్రమ్మఱఁ గొంతవడి విచారించుచు నిలువం
బడి, కడకుఁ బాపనిశ్చయుండై బలవర్ధన వధోద్యోగంబున నేఁగుదెం
చిన చెలికానింగని యా వనచరవల్లభుం డిట్లనియె. "మిత్రమా! చిత్ర
మయ్యెడును; కళత్రముఁ జూడ వేడుకపడి గడియక్రిందటనే చని

యింతలోనే యేల తిరిగివచ్చినాఁడవు? నీ రాకకుఁగల కారణము తెలుపుము," అనిన నా నక్రంబు వక్రంబుగా నవ్వి యిట్లనియె: "నీ చేత ననుజ్ఞాతుండనయి మందిరమునకుం జని నా సుందరిం గని యమందానందంబున నీ విచ్చిన స్వాదుఫలంబుల నొసంగిన నంతరంగంబునఁ బొంగి యా యంగన కొన్ని మెసఁగి, వాని రుచి కచ్చెరువడి "యీ పండ్లెక్కడివి? వీని నీకిచ్చిన పుణ్యాత్ముఁ డెవ్వఁడు? నీ విన్ని నాళ్ళుదాఁక నెక్కడ మసలితివి? చెప్పు" మనిన నే నిట్లు చెప్పితిని; తపతీనది యొడ్డుననుండు మేడిచెట్టుమీఁద బలవర్ధనుండను తరుచర సత్తముం డొకఁడు కలఁడు. ఆతఁ డనింద్య చరిత్రుఁడు; స్నేహపాత్రుఁడు; నాకుం బరమమిత్రుఁడు. ఆ దయాళుని యాదరణంబున సమస్తము మఱచి యాతనికడ నపూర్వసుఖం బనుభవించుచు నిందాఁక వదలి రాలేకుంటిని. ఆమహామహుండు నన్ను సాంత్వవచనంబుల వీడుకొలిపి యమృతోపమానంబులగు నీ ఫలములనిచ్చి నీ యొద్దకుం బుచ్చెను" అని నీ యుపకారకృత్యంబులు పాటకుగతింబొగడి నీ సుగుణసంపదను సహస్రముఖంబులఁ గొనియాడితిని. నీ చెలియ లా పలుకులువిని నన్నుఁ గినిసి "ఓయి! కృతఘ్నుఁడా! సుహృత్తముఁడైన యావనచరోత్తముని నీతోడఁగూడ మన భవనమునకుం గొనివచ్చి మనపాలిటి వేలుపుం బోలెఁ బూజించి జన్మసాఫల్యంబుగాంచక యా చెట్టుమీఁద నొంటిం దిగవిడచి వచ్చితివే? ఇప్పుడపోయి యాకపికులగ్రామణికి నా మ్రొక్కని మ్రొక్కి యిక్కడకుం దోడితెచ్చి మఱి నాతో మాటాడుము" అని వదరి సన్నిచటికింబంపిన నిన్ను వెంటఁబెట్టుకొనిపో వచ్చితిని. నాప్రార్థనం బంగీకరించి వేగమ మదీయాగారంబునకు విచ్చేయుమా పోదము" అని యా కపటాత్ముండు మిథ్యావినయంబునఁ బలికిన వానరవరుండు నెయ్యునిమాట కడ్డమాడలేక యియ్యకొని యిట్లనియె, "క్రకచా! నాకు నీ యిల్లు లాఁటియిల్లుకాదు? నీ యాగారంబున కరుదెంచి నీవలన సత్కారంబులం బడయుటకు నా కేమియు నడ్డంకిలేదు; కాని యొక్క ప్రతిబంధముమాత్రము కనఁబడుచున్నది. నేను వనచరుండనయ్యును నీవనంబులనె చరియింపఁగలను గాని మీరుండు వనంబులఁ జరింపఁ

జాలను. మీ గృహంబున కెట్లు రాఁగలుగుదునో చెప్పుము" అనిన మకరంబును మిన్నువంకఁజూచి యాలోచించి యిట్లనియె, "నేనంత విచారింపక నిన్నుఁ బిలుచుకొని పోఁదలచినవాఁడనుగాను. నాయిల్లు నీకు రారానిచోటుగాదు మేముండునది యీ యేటిలంకలోని యొక్క సుందరమందిరము. దాని చుట్టుపట్టుల ఫలవృక్షము లనేకంబులుగలవు. ఆ దీవి మనోజ్ఞతం బేమని చెప్పుదును? అది భూతలస్వర్గంబునాఁ జూడ్కికి వేడ్కగొలుపుచుండును. రేపును మాపును మా మందిరంబున సర్యగొనుచు నిచ్చవచ్చినప్పుడెల్ల నందు విహారంబు సలుపుచుండ వచ్చును. మార్గంబున నీకొక్కయపాయంబు గలుగకుండ నిన్ను నా వీపుమీఁద నెక్కించుకొని యుపాయముగాఁ గొనిపోయి మా యావాసంబుం జేర్చి నీచెలియ లత్యంతతాత్పర్యంబున నావహించిన శాకపాకంబులతోడి భక్ష్యంబుల నుపాయనంబుచేసెద. నీసోదరి మన రాక కెదురు చూచుచుండును. రమ్మా! పోయివత్తము" అనిన మాఱు మాటాడక యాకీశలోకేశుండు పృథావతీర్ణుండయి క్రకచుని వీపునం దూఁకెను. దూఁకుటయెతడవుగా మకరంబు సుకరంబుగా వానరంబును వెన్నునరిడుకొని చనుచుఁ దెన్నునఁదనలోఁదా నిట్లు పలుకఁజొచ్చెను. "అయ్యయ్యో ఎంత దారుణకర్మంబు గావింపఁ జూచుచున్నాఁడను! ఒక్క యాఁడుదాని నిమిత్తము, మిత్రముఁ దోరించి ఘోరపాతకంబు కట్టుకోఁచలసివచ్చెఁగా? ఇఁక నేనేమర్గతికిఁబోదునో యెఱుంగను నను వంటి దుష్టాత్ము లెందైననుందురే? దైవమా! నేనేమి నిందలపాలు కావలయునో" అని యారెలుంగున ననుకొనుచు ఖిన్నహృదయుండై చనుచుండఁ గపివరుం డించుకగ్రహించి "మిత్రుఁడా! ఇప్పుడు నీమోము చూడఁజూడ నొండొకవిధంబుగాఁ దోఁచుచున్నది. నీయందు ముందున్న యుత్సాహంబు గానరాదు. చిత్తంబు విచారాయత్తంబయి తత్తరించుచున్నట్లు కనుపట్టుచున్నది. దేహము లాధివ్యాధిజరాన్వితములు. గృహంబున నా సహోదరి సేమమున నున్నదిగదా?" యనెను. క్రకచుండు పలుకులఁ దడఁబాటుపడుచు "నీ చెల్లెలు కొంచెము వ్యాధిబాధితయయి యున్నద"నెను. అంతటి యల్పరోగ

మునకా నీ మొగమింత చిన్నబోయినది? "చీటికిమాటికిఁ డాలిమి దిగ నాడుట మగవాడికిగాదుగదా" యని బలవర్ధనుండు పలికెను. "ప్రబల వ్యాధిపీడిత యయియే యున్నద"ని క్రకచుండు సందేహించుచుఁ బలికెను. అంత నశ్రుమిశ్రితాక్షుండయి వానరాధ్యక్షుండు "వైద్యులం బిలిపించి వేగిరము దివ్యౌషధప్రయోగము చేయించినావుకావా?" యని యడిగెను. "ఏమి మాయరోగమో యెఱుఁగను; వైద్యు లెంతమంది యెన్ని మందులను వేసినను గుణమియ్యలేదు. నిన్నట్లు వీడ్కొని పోయి చూచునప్పటికి నీచెలియలు యమయాతన పడుచున్నది. నాకుం జూడ నీరోగము కుదిరి జీవించుటయె కష్టముగాఁ దోఁచుచున్నది. అని క్రకచుండు బదులుచెప్పెను. విని వనచరుఁడు "ఇదియేమి? మిత్రుఁడా? ఇంత వెఱ్ఱిపనిచేసితివి! ఇంట భార్య యిట్టి యవస్థయందుండఁగా మందు మాకును విచారింపక యొంటినివిడిచి మిత్రునియొద్దకు రాఁ జిత్తమెట్లొప్పెను? విందునకుఁ బిలువ నోరెట్లాడెను? అని మందలించెను. "ఘనవైద్యులు కొందఱు కోఁతిగుండెకాయతో మందీయవలెనని చెప్పుచున్నారు. అందునిమిత్తమయి వచ్చితి" నని యా క్రకచుండు శోకవ్యాకులిత హృదయుండగు కతంబున మతిపోయి తన గుట్టు బయలఁ బెట్టెను. ఆ మాట విన్నతోడనే ప్రాణములు గడగడలాడి మేను చెమర్పఁ గొంతవడి యా మర్కటంబు దిగ్భ్రాంతి నొందియుండి యంతలో డెందంబునందు డిందుపఱచికొని "అయ్యో! ఖల్వాటుండను సూర్యాతపమునకు సహింపలేక తాళవృక్షచ్ఛాయలకుఁబోవఁ దాటిపండు పడి తల పగిలినట్టు దైవోపహతుండగువాఁ డెందుఁబోయినను నాపదలు వెంటవచ్చునుగదా! అడవిని విడిచి మృగసంచారము సహితము లేని సముద్రతీరముఁ జేరియు మృత్యుముఖప్రవిష్టుండ నైతిగదా" యని వగచుచుఁ దెచ్చికోల్ధైర్యంబున నిట్లనియె. "క్రకచా! యెంత పిచ్చిపనిచేసితివి! వానరహృదయంబుకొఱకు వచ్చినవాఁడ వామాట నించుక మిత్రుని చెవిని వేయవలదా? ముందే చెప్పిన నుదిమి గదిరియుంట నొవ్వియలేక మేడిచెట్టునం దవిలించియుంచిన నా గుండెకాయ నప్పుడె కూడఁ గొనివత్తునుగదా? నీ మనోగతంబు నెయ్యుని

కడ న్మఱుఁగుపఱచి పని చెఱిచితివి. ఇట్టి నీవు నీ కళత్రమునకు శత్రుఁడవు గాక మిత్రుఁడవే? మనకింతవఱకు నడిచినదంతయు వృథాత్రిప్పట యయ్యెను. అయిననేమి? శీఘ్రంబ మరలి మేడిపొంత కరుదెమ్ము. గుండెకాయం గొనివత్తము." అను మాయమాటలు నమ్మి మకర మా వానరమును గ్రమ్మఱ మేడికడకుం గొనితెచ్చి విడిచెను. ఇఁకఁ బ్రాణములు దక్కెనని యా మర్కట మొక్కవడి భూరుహంబునెక్కి వెక్కిరించుచు, హృదయమును లేదు గిదయమును లేదు పోపొమ్మని క్రకచుని గద్దించెను. అదిచూచి మొసలి మోసముం దెలిసికొని యేవలనను మోసమెట్టిదో యెఱుఁగని నన్ను నీ ముసలికోఁతి యట్టె మోసపుచ్చెఁగా యని వగచుచుండఁ బ్లవంగ మిట్లనియె. "నీవు ప్రసాదపురస్సరముగా నెన్నెన్నియో యుపచారవాక్యంబులు పలికి నిటల తటఘటితాంజలివై నీ యింటికిరమ్మని దేవురించుటంజేసి, పాపపు మోమోటమి నోరునొక్కి రాననలేక మోసపోయితిని; గాక నన్నుఁ బ్రతాపరింప నీతరమగునే? ఓరీ! మూఢాత్మా! మాటదాఁటక వచ్చి చేపడినవాఁడె తప్పించుకొని పోయెనుగదా! యని సంతాపంబు నొందక యీపాటి నీదారిం బొమ్ము. ఒక కూర్మముచేత నక్కయంతటిది మోసపోయినది. ఇఁక నీవనఁగా నెంతవాడవు? వినవలతువే నాకథఁ జెప్పెద వినుము."

కర్ణాటకదేశమునందుఁ గావేరి యను నది యొక్కటి ప్రవహించుచుండును. సాగరసంగరమునకు సమీపంబునఁ దత్తీరంబున నొక్క వటమహీరుహము గలదు. ఒకనాఁటి మధ్యాహ్నసమయంబున నొక కమఠంబు జలంబులు వెడలివచ్చి యచ్చెట్టు నీడను సుఖముగా నిద్రించుచుండెను. అప్పుడు తత్ప్రాంత కాంతారంబున నుండు ఫేరవం బొక్కటి యా యేట నీరువట్టు మాన్పుకొనం జనుదెంచి తీయని పానీయంబు లాప్యాయనంబుగాఁ బానంబుచేసి యా సమీప పాదపచ్ఛాయం బవళించియున్న తాఁబేలుంగాంచి పరమ సంతోషంబున మెల్లమెల్లగాఁ దారుచుం బఱతెంచి యేమఱుపాటున దాని వీపుమీఁదఁ దన పాదంబు నూఁది త్రొక్కెను. అంత నా తాఁబేలు మేలు కని కీలెఱింగి కాలునుం

గేలునుం దటాలున ముడుచుకొని తల పొట్టలో నిముడుచుకొని కదలకుండెను. క్షుధార్తంబగు మృగధూర్తంబును బదంబున దాని నదిమి పట్టి యిట్టులు పొరలించుచుఁ గోఱలు మొఱకలువాఁడిఁ గొఱుకుచుఁ గూర్మంబు మర్మంబులు భేదింపఁజాలక చాలసేపువిడిచిపోవనుమనసురాక క్రిందను మీఁదను బడుచుండెను. అక్కరణి నది మిక్కిలి చిక్కులు పడుచుండ నక్కూర్మం బెక్కరణినైన నీ మ్రుక్కిడి నక్కను డక్కవెట్టి ప్రాణంబులు దక్కించుకొనెదంగాకని తలంచి యించుక యాలోచించి మాయయచ్చుపడ నిట్లనియె : "ఓ జంబుకోత్తమా! తత్త్వంబెఱుంగం జాలక యేల యీలాగున వృథాప్రయాసంబు పడియెదవు? నీ వీకైవడి వేయేఁడులు కొఱికినను నా యొడలు నీకుఁ గొఱుకుడు పడఁగలదే? నీ వేవిధంబునను వధించి యాపోవ నా మాంసంబు మెసవకయపలెఁ బోవని తలపోసి యీ మనుగడపయి నాసను గోసి యనాయాస మరణంబునొంద నిశ్చయించుకొన్నాఁడను. విషముఁబోని బ్రతుకు; మాకెప్పుడును మృత్యువు శిరస్సుపై నాడుచుండును. కాఁబట్టి యాఁకొన్న మహానుభావునకు నీ కొక్క చక్కని యుపాయం బుపదేశించెదను వినుము. నన్నుగ్రన్నంగొనిపోయి నీరంబులంజేరిచి కొంతతడ వందు నాననిచ్చిన, నామేను వెన్నవలె మెత్తనయి నిమిషములో నీ చిత్తము వచ్చినట్లగును. అప్పుడు కడుపార నా మాంసంబుతో సుఖపారణచేసి నీ వలసినచోటికిం బోవచ్చును. అట్లు చేయుము." అనిన గోమాయువును మాయావాగురం జిక్కుకొని యక్కపట వచనంబులు వేదవచనంబులని నమ్మి యదియు కార్యమ్మనుకొని తాఁబేలును బేలుపోయి జలంబులఁ బడవైచియుఁ గొంతమేలుకువగలిగి పట్టువిడువక గట్టిగాఁ దన ముంగాళ్లు దాని వీపున న్మోపి పండ్ల యూటలు ద్రావుచు దాని మీఁదనె కన్నిడి ముహూర్తమాత్రంబు నిలిచి మరలఁ గొఱికిచూచి దాని బొరుచు పండ్లకు సాధ్యముగాకున్నఁ గమఠంబున కిట్లనియె. "తడవాయెను నిన్ను జలంబుల నిడి యొడలు మెత్తపడినఁ గడువడిం గుడిచి నడువవలెనని కాచుకొని యున్నాఁడను. ఏవేళకును నీ మేను నానుజాడ గానరాకున్నది. ఏమిచెప్పెదవు?" అనినఁ గచ్ఛపం బిట్లనియె.

మిత్రుఁడా! నీవు నా వచనంబులయందు గుఱియుంచక వెన్నుమీఁద రెండుపాదములును దిట్టముగాఁ బెట్టియున్నవాఁడవు. నీరంట నలను పడకుండ వెన్నునకెల్ల సరిపోవ దారుణముగాఁ జరణంబులు నిలిపి యుండ, నా మే నెట్లు నానఁగలదు? నీ కోరిక యెట్లీడేరఁగలదు? ఇందు నా దోసంబు వీసంబును లేదు. నోటిశనిచేత నీవేయింతతడవు నవనమ్రుక పడి చెడితివి. అయిన నిప్పుడేమాయెను? ఇఁకనైన నామాట నమ్మి వెన్నుఁమీఁది పాదంబులెత్తి క్షణమాత్రము చేరువంగూరుచుండి చూచుచుండుము. ఇప్పుడ పులకండంబులఁబోలు నాకులఖండంబులతో విందారగించి యనాయాసంబుగాఁబోవచ్చును.'' అనిన నా సృగాలంబు కూర్మంబు వాక్యనియమంబులు నిశ్చయంబులుగా నగచి తదుపదిష్టప్రకారంబున వెన్నుపై నిడియున్న యడుగుదోయిని మెల్లగాఁ దీసెను. తీసిన తోడనే ప్రాణంబులఁ దక్కించుకొని యక్కమఠంబు శరవేగమునం బఱచి తోతు నీళ్లం బడియెను.

అని చెప్పి యా మర్కటము మఱియు నిట్లనియె. "ఓరీ! మకరాధమా! మోసములకెల్ల నిధియగు వంచకమే యిట్లు వంచింపఁబడఁగా, నీవంటి పుట్టుగ్రుడ్డు మోసపోవుట యొక యక్కజమా? చాలుఁజాలు. నీతోడ మైత్రిచేసినందునకు ఫలము తోడనే కలిగినది. ఇఁక నీమైత్రిని నీ యొద్దనె యుంచుకొమ్ము. లోకవిఖ్యాత సత్యసంధనయ్యు దైవవంచన చేత రాజ్యంబుఁ గోలుపోయి త్రాణచెడి రిపులతోఁ బడలేక కళత్ర ప్రముఖ సుఖవిముఖుండనై లేచివచ్చి నిలువ నీడయుఁ ద్రాగ నీరును గానక యేకాకినై యడవులుపట్టి తిరిగితిరిగి కడకీవృక్షంబులఁ జేరి స్వచ్ఛందాహారంబున నుదరపూరణంబు గావించుకొనుచుఁ గులగోత్ర నామంబులు దాఁచుకొని యిన్నటిదాఁక కాలము గడుపుచుండి, నీ పెద్దతనంబుచూచి బుద్ధి భ్రమసి మిత్ర వంచకుఁడవని తెలియంజాలక నీతోడి సఖిత్వం బంగీకరించితిని. నీవును బాపాత్ముఁరాలైన నీభార్య దుర్బోధచేతఁ జెడుబుద్ధిపుట్టి, కుటిలోపాయంబున నన్ను మట్టుపెట్టఁ దలఁచి, మా యింట విందారగింతువుగాని రమ్మని నచ్చికబుచ్చిక లాడిన నే నా మర్మమెఱుఁగక నీ మందిరమ్మున దిరముగాఁ దలదాఁచు

కొన నిశ్చయకుఁడనయి నితాంత సంతోషంబున బయలుదేఱి మధ్య
మార్గంబున నాకారవికారాదులచే భవదీయంబగు మనోవ్యవసాయం
బూహించి పూర్వ పుణ్యవశమున నీ యుపాయంబు తోఁచఁబట్టి
బ్రతికి, పులినోటి విడిచినవానిఁగా భావించుకొనుచున్నాఁడను. అందు
వారు మంచియెఱుఁగరు; చెడ్డ యెఱుఁగరు; పట్టి కుచ్ఛితములు పన్ని
తమ పట్టినపట్టు సాధించుకొనఁ జూతురు. నీవు నాతోడి చెలిమిం జేసి
యిల్లు పట్టుకున్న నన్నెలాగునైనఁ జంపఁదలఁచి యిది యంతయు
నీ భార్య పన్నిన పన్నుగడయయి యున్నను. దేహములు బుద్బుద
ప్రతిమంబులు; పరువము ఫేనసదృశంబు; సంపదలు తటిచ్చంచలం
బులు; అలంకారంబులు భిత్తి చిత్రంబులు; దారపుత్త్రాదు లా శ్మశాన
గమనులుగాని యూపయిని వచ్చువారు కారు; ధర్మమొక్కటియే
తోడవచ్చి తన్నుఁగాచునది. అట్లయ్యును నీవు తగవును ధర్మంబును
దలపోయక సద్యఃపాతియగు తనువును నమ్ముకొని కీర్తి శరీరమున్విడిచి
నిత్యంబగు నపఖ్యాతి గడియించుకొంటివి. ప్రాణాధికుఁడయిన మిత్త్రునినే
యిట్లు చేసిన పరమ సాహసికునకు నీకు నితరులు తృణకణంబులు.
మీఁద నీ వేమిగతిఁ బోవువాఁడవో! నీయట్టి మిత్త్రద్రోహిం జూచు
చున్న నఘంబొదవును. ఇఁక నీవు నాముందఱ నిలిచి నన్నుఁ గనలిం
పక, వేవేగ నీ యింటిత్రోవఁ బట్టిపొమ్ము"అని ముక్కును మొగమును
జూడక దూఱినాడి, నిరుత్తరుంజేసి యా మొసలిజేని నక్కడనుండి
సాగనంపెను. క్రకచుండును నిస్పృహుండై దిక్కులు చూచుచు
దోయిడి చేతులన్నగిడి నిజనివాసంబునకుం జనియెను.

కాఁబట్టి మోసముచే నెట్టిపనినైన సాధింపవచ్చును. నా యం
దనుగ్రహించి మీరందఱు నాకొక్క సాహాయ్యము మాత్రము
చేయుఁడు. మీరందఱును ముందుగాఁబోయి బ్రాహ్మణుఁడు చను
మార్గమునందు దూరదూరముగా నిలిచి, యాతఁడు మీ సమీపమున
నుండి పోవునపుడు 'విప్రోత్తమా! కఱికుక్క నేల కొనిపోవుచున్నా'
వని ప్రశ్నచేయుఁడు, ఇంతమాత్రము మీరుతోడుపడితిరా, మిగిలిన
కార్యమును నేను జక్కఁబెట్టెదను. అని యా వృద్ధవంచకుఁడు పలి

కెను. మంచిదని యా పనికి సమ్మతించి, తక్కినవారందఱును బ్రాహ్మణున కగపడకుండం జని యాతఁడు వచ్చు దారిలో నందందు గూరు చుండి, యాతనిరాకం బ్రతీక్షించుచుండిరి. ఇంతలో బ్రాహ్మణుండును మేఁకపోతు నీడ్చుకొని, మొదటి వంచకుఁడున్న తావునుండి పోవు చుండెను. అప్పుడు వాఁడు "అయ్యో! మీరుచూడంబోయిన బ్రాహ్మ ణోత్తములుగా నున్నారు. ఈ కఱికుక్క నేల ముట్టుకొని తీసికొని పోవుచున్నారు?'' అని యడిగెను. అందున కా బ్రాహ్మణుఁడు నేత్రాం తంబులఁ గెంపుగదుర, "ఛీఛీ! త్రాగుబోతా! దురాగత భాషలు ప్రేలకుము. నే నధ్వరార్థము కొనిపోవుచున్న యీ పవిత్రమయిన ఛాగ మును అపవిత్రమయిన శునకమునుగాఁ బలుక నీకు నోరెట్లు వచ్చినది? పోపో"మ్మని, యా మాటలను లక్ష్యముచేయక తనత్రోవం బోవుచుం డెను. మఱి నాలుగడుగులు సాగిన తరువాత రెండవ ధూర్తుఁ డెదురు వచ్చి మస్తకన్యస్తహస్తుఁడయి నమస్కరించి, బ్రాహ్మణునివంకఁ జూచి, 'స్వామీ! మీరు సర్వముం దెలిసినవారుగదా? ఈనల్లకుక్క నెగ్గులేక ముట్టుకొనుచున్నారే' మని పలికిపోయెను. అందున కా విప్రుఁడు డెందములో నించుక సందేహించి, వాని మాటకు మాఱు చెప్పక మేఁకం గొనిపోవుచుండెను. ఇంతలో మూఁడవవాఁడెదురుపడి, "ఇదియేమి? బాపఁడా! ఇంత యక్రమమునకు [illegible]ఁబడినావు. నీ వెత్తినది బ్రాహ్మణజన్మముగదా? అట్లయ్యును గులశీలముల నేటఁ గలిపి లోకులెల్ల నవ్వఁ బట్టపగలు రాజవీధింబడి యీ యపవిత్ర మయిన వేపి నెచటి కీడ్చుకొని పోయెదవు? ఈ రాజ్య మేమిపాపము చేసెనో కాని కులాచార ధర్మములు నిర్మూలము లయిపోవుచున్నవి" అని వదరెను. అంత నా యనంతాసురుఁడు మతి వికలత్వంబునొంద శంకాముగ్ధుండయి, "ఒకరు కా రిద్దఱుగారు; కన్నవారెల్లను దీనిని వేపి యనుచున్నారు. నా కొక వేళ మతి భ్రమ జనియింపఁబోలు" నని చింతించుచు, నల్లముయ్యేలలాగున నూఁగ నిటునటుం జనఁదోఁచక యనుమానించుచు నిలుచుండెను. మొదటినుండియు బ్రాహ్మణుని నెడఁ బాయక వెంబడించి వచ్చుచున్న వృద్ధవంచకుఁడు, తన ప్రయత్నము

ఫలోన్ముఖమునకు వచ్చెఁగదాయని సంతోషించి, బ్రాహ్మణునకు వినఁబడునట్లుగాఁ జేరువనున్న తోడుదొంగలతో నిట్లనియె: పాప మీ ముగ్ధ బ్రాహ్మణుని వెఱ్ఱివానింజేసి యెవ్వరో యిట్లు కుక్క నొకదానిం గట్టిపెట్టిరి. చూచితివా యీతని దురవస్థ! అని విప్రుని యకార్యకరణమునకు వ్యసనపడునట్లు పలికి పకపక నవ్వెను. బ్రాహ్మణుఁ డా మాటలు విని, యింద ఱేకవాక్యముగాఁ జెప్పిన దబద్ధము కానేరదని నిశ్చయించి, తన ప్రమాదమునకు లోపల నొచ్చుకొనుచు యజనచ్ఛాగము నచటనే విడిచిపెట్టి, మరల వెనుకకుంబోయి ధూర్తులందఱుఁ గొలంకు కెలకునఁజేరి నవ్వఁ దటాకములో స్నానముచేసి శుచియై తడిబట్టలతో నింటికిఁబోయి పాపపరిహారార్థము గాయత్రి జపించుకొనుచుండెను. ధూర్తు లా మేఁకపోతుం గొనిపోయి చంపుకొని తినిరి."

## పరామర్శ

**అర్థాది విశేషములు :**

అగ్గలముగా=అధికముగా; నిక్క ము=వరవా; ఛాగము=మేఁక; దండహస్తులు=చేతియందు కఱ్ఱగలవారు; ఉదుంబర వృక్షము=మేడి చెట్టు; వలకేలు=కుడి చెయ్యి; సూడిద=కానుక; సూరెలు=పార్శ్వములు, డోలాందోళనము=ఉయ్యెలవలె వెనుకముందులకుఁబోవుచుండుట; వనచరము (వ్యు) అడవులయందు చరించునది; పాఠకుఁడు=బట్టువాఁడు; కీశలోకము=వానర సమూహము; ఖర్వాటుఁడు=బట్టతలవాఁడు, నచ్చిక బుచ్చికలు=నమ్మకపు మాటలు; భిత్తిచిత్రంబులు=గోడమీఁది బొమ్మలు; సద్యఃపాతి=వెంటనే పడునది; అనంతాసురుఁడు=బ్రాహ్మణుఁడు.

**వ్యాకరణాది విశేషములు :**

అహస్+రాత్రము (సం) అహోరాత్రము; ములుకులు (ఏక) ములికి (వ్యా) అంతిమాక్షరమునకు పూర్వముండు ఇకారము ఉకారమగుట గమనించునది; వృక్ష+ఛాయ (సం) వృక్షచ్ఛాయ; బుద్బుదము (వి) బుడగ; తటిత్+చంచలము (సం) తటిచ్చంచలము; సహస్రముఖములు (సమా) ద్విగువు; పగలు+పగలు (సం) పట్టపగలు (వ్యా) తొలి యచ్చుమీఁది వర్ణంబులకెల్ల ద్విరుక్తటకారము.

**ప్రశ్నలు :**

వంచకులు విప్రుని ఎట్లు మోసగించిరి? క్రకచ బలవర్ధనులకు మైత్రి ఎట్లు వర్ధిల్లెను? బలవర్ధనుఁడు తనప్రాణముల నెట్లు దక్కించుకొనెను? "మోసముచే నెట్టి పనినైన సాధింపవచ్చును." అను నీతిని దెలుపు కథను వ్రాయునది.

# బౌద్ధాంధ్ర కళాస్రష్టల విశిష్ట సంప్రదాయము

శ్రీ మల్లంపల్లి సోమశేఖర శర్మ గారు.

ఈ వ్యాసమును రచించినది శ్రీ మల్లంపల్లి సోమ శేఖరశర్మగారు. వీరు సుప్రసిద్ధులైన విద్వాంసులు, విమర్శకులు, చరిత్ర పరిశోధకులు. వీరి రచన మృదులమై స్పష్టత కలిగి ప్రకాశించుచుండును. ప్రాచీన శాసనాన్వేషణలో వీరు సిద్ధహస్తులు.

కవి, కథకుడు, నాటకకర్త, మహాపండితుడు, చరిత్ర పరిశోధకుడు, మూర్తీభవించిన ఆంధ్రశక్తి, నిరాడంబర జీవి, వాఙ్మయ తపస్వి, కర్మయోగి, మహనీయుడు, అని ఇటీవలనే చెన్నపురి ఆంధ్రమహాసభవారు శ్రీ శర్మగారిని సన్మానించుటకై జరిపిన సన్మాన సభకు అధ్యక్షులగు గౌ. శ్రీ పాకాల వెంకట రాజమన్నారుగారు (మద్రాసు హైకోర్టు - ప్రధానజడ్జి) పొగడియున్నారు.

ఆంధ్రవీరులు లోనగునవి వీరి యితర గ్రంథములు.

ఆంధ్ర దేశమున కంతటికిని కీర్తిప్రతిష్ఠలు తెచ్చినది అమరావతీ బౌద్ధస్తూపపు శిల్పకళ. క్రీస్తు శకారంభ శతాబ్దులలో శాతవాహనులు ఆంధ్ర సామ్రాజ్యమును పరిపాలించుచుండిన కాలముననే కృష్ణా గోదావరీ తీరప్రదేశములలో బౌద్ధము సుమ్మరముగా వ్యాపించి నట్లు చెప్పుట కాధారము లున్నవి. ఆ కాలమున ముఖ్యముగా కృష్ణానదీ తీరమున ఎన్నియో బౌద్ధస్తూపములు వెలసినవి. స్తూపము బుద్ధుని నిర్వాణమునకు సంకేతమై క్రీస్తుపూర్వము నుండియు ఉత్తర హిందూస్థానమున వెలయుచుండెను. అయ్యును దానికొక విశిష్టత నాపాదించి, దానిని ఆరాధన యోగ్యముగాఁ జేసినవారు బౌద్ధాంధ్రులే.

బౌద్ధములో స్తూపమును చైత్య మందురు. బౌద్ధాంధ్రులు చైత్యకసంప్రదాయ మను నొక క్రొత్త సంప్రదాయమును స్థాపించినారు. ధనకటకము (అమరావతి) లోని మహాచైత్యము ఆంధ్ర దేశము లోని స్తూపములలో కెల్ల నతి పురాతన మయినది. అది మూలచైత్యము.

బౌద్ధాంధ్రులు చైత్యమును ఆరాధించుచు వచ్చుటచేత తీరు లోను రూపులోను దానికిని ఉత్తరహిందూదేశ చైత్యమునకును కొంచెము తేడా కలిగినది. అచ్చటను చైత్యమును ఇటుకలతో మాత్రమే రూపొందించుచుండెడివారు. అది కారణముగ ఉత్తరహిందూ స్థాన చైత్యములపై బొమ్మలను చెక్కుట కవకాశము లేకపోయినది. ఏ బొమ్మలు చెక్కవలసి వచ్చినను ఆ చైత్యము ద్వారతోరణ శిలా స్తంభముల మీదను కమ్ముల మీదను ప్రాకారరేఖలలోని నిలువరాల మీదను, అడ్డకమ్ముల మీదను చెక్కెడివారు. బార్హూత్, సాంచీ స్తూపముల లోని పద్ధతి ఇదియే.

కాని తెలుగు దేశమున అట్లుకాదు. బౌద్ధస్తూపములలోని అందము మినహాగా మిగిలిన చిత్రభాగము నంతను శిలాఫలకములతో కప్పి ఆ ఫలకముల మీద చిత్రవిచిత్రములైన ప్రతిమలను గండ రించువారు. అద్భుత పరికల్పనములను చేయువారు. అందువలన తమ కళానైపుణ్యమును చూపుటకు కావలసినంత అవకాశము కలిగినది. అమరావతి, నాగార్జునునికొండ మొదలగు ప్రాచీనాంధ్ర బౌద్ధ క్షేత్ర ములలోని చైత్యము లన్నియు శిల్పచిత్రపరిశోభితములైన శిలాఫలక ముల మీదను, ద్వారతోరణపు కమ్ముల మీదను, ప్రాకారరేఖల లోని రాలమీదను చెక్కిన చిత్రములన్నియు సాధారణముగా బుద్ధ జీవితమునకు సంబంధించిన గాథలుగా జాతకగాథలుగా నున్నవి. జాతక గాథ లనగా బుద్ధుని పూర్వజన్మములకు సంబంధించిన గాథలు.

నాగార్జుననికొండ, అమరావతీ మహాచైత్యములలో బుద్ధుని జీవితమునకు సంబంధించిన గాథలేగాక మనసును రంజింపజేయు నపూర్వములైన పెక్కు జాతక కథలు కూడ అనేకము లున్నవి. ఈ జాతక కథలు పునర్జన్మ సిద్ధాంతమును ప్రతిపాదించుచుండును. దయ, ధర్మము మొదలైన కళ్యాణ గుణములకు తార్కాణముగా సత్కార్య ములు, ధర్మకార్యములు వేలువేలుజన్మములలో చేయుచురాగా ఈ జన్మమున బోధిసత్వుడు బోధివిజ్ఞానమును పొంది బుద్ధుడై నిర్వాణ మును మెట్టెనని ఆజాతక కథల బోధించుచుండును.

అందువలన ప్రతిజీవికి జన్మాంతరము కలదనియు ధర్మపథములో విశుద్ధవర్తనులై నగడినచో ఉత్తమ జన్మము కలుగుననియు ఎన్నటి కైన అట్టివారు బుద్ధపదము నంది సంసార దుఃఖములనుండి విముక్తి చెందుదురనియు ఈజాతక కథలు బోధించుచుండును. చైత్యమునకు శిలాప్రాకారరేఖకు మధ్యనుండినది ప్రదక్షిణవీథి. ప్రదక్షిణవీథిలో ప్రదక్షిణములు చేయునపుడు బుద్ధభగవానునిగొల్చు భక్తులకు లోపలి తట్టు ప్రాకారరేఖలమీదను, చైత్యము దిగువభాగమైన వేదికచుట్టును కప్పిన శిలాఫలకముల మీదను కానవచ్చు. బౌద్ధ జాతక కథలు భక్తుల కున్నతాశయములు కల్పించి జీవితలక్ష్యమును నిరూపించు చుండును. బౌద్ధస్తూప ప్రాకారరేఖ శిలలమీఁది, బయటవైపు బుద్ధ జన్మమునకు సంకేతమైన పద్మముల చిత్రములును నాగజాతి స్త్రీ పురుషులు చైత్యమును ఆరాధించుచున్నట్లు చెక్కిన చిత్రములుమాత్రమె చూపట్టుచుండెడివి.

చైత్యప్రాకారరేఖలో నాలుగువైపులను నాలుగు ద్వారము లుండును. భక్తులీ నాలుగుద్వారములగుండ ప్రదక్షిణవీథిలోనికి వెళ్ళి చైత్యమునకు ప్రదక్షిణములు చేసి, దానిని పూజాకుసుమాదిద్రవ్య ములతో ఆరాధించుచుందురు. వేదిక, దానిమీఁది అండము, దాని పైన హర్మిక, దానిపైని దండసహితమైన ఛత్రము- ఈయన్నింటితో కూడినదే చైత్యము. వర్తులాకృతియైన వేదికపైని అండముచుట్టును కొంత ఎడముండును. చైత్యద్వారముల కెదురుగా వేదికమీఁది నాలుగువైపులను అండము ముందుగా అయిదేసి కళ్యాణ స్తంభము లుండును. వీనిని ఆర్యక స్తంభము లందురు. ఈ స్తంభముల దిగువ కొంతభాగము వలెను ఆయతముగాను, అటుపైని ఎనిమిదిపలకలుగాను తీర్చెడివారు. స్తంభాగ్ర భాగమున యక్షిప్రతిమలను అలంకా రార్థము చెక్కుట యాచారము. ఈ స్తంభముల ఊర్ధ్వభాగమున బుద్ధ జయంత్యుత్సవ సందర్భములలో పతాక లెత్తుటకు రంధ్రములుండును.

ద్వారమున కెదురుగా ఆయతముగానున్న స్తంభభాగముల మీఁద పంచకళ్యాణములను చెక్కుట శిల్పసంప్రదాయము. బుద్ధుని

జననము, మహాభినిష్క్రమణము, బుద్ధబోధ, మృగవనములో జేసిన బుద్ధుని మొదటిబోధ, బుద్ధుని మహాపదనిర్యాణము, అను అయిదును బుద్ధుని జీవితములోని ప్రధానఘట్టములు. వీనినే పంచకళ్యాణము లందురు మహానిష్క్రమణ మనగా బుద్ధుడు సమస్తమును త్యజించి, దుఃఖ నివారణసూత్రమును అన్వేషించుచు అర్ధరాత్రివేళ బయలుదేఱి వెళ్లుట. బుద్ధసంబోధి యనగా ఉరువేలా వనమున అశ్వత్థ వృక్షము క్రింద బుద్ధుఁడు యోగసమాధియం దుండఁగా దుఃఖనివారణ రహస్యము గోచరించుట. బుద్ధుని నిర్యాణమును బౌద్ధులు మహాపద నిర్యాణ మందురు.

బుద్ధుని జన్మమునకు పద్మమును, మహాభినిష్క్రమణమునకు గుఱ్ఱమును, బుద్ధసంబోధికి అశ్వత్థవృక్షమును, మృగదావనములోని మొదటి ధర్మబోధకు ధర్మచక్రము – లేళ్లు దిగువగల సింహాసనమును, మహాపద నిర్యాణమునకు చైత్యమును శిల్పు లేర్పఱుచుకొన్న సంకేతములు. ప్రాకార ద్వారమునుండి లోనికిరాగానే భక్తుని దృష్టిని ఉన్నతములైన కళ్యాణస్తంభములును, వాని దిగువ భాగమున చెక్కిన పంచకళ్యాణములను ఆకర్షించుచుండును. కళ్యాణచిత్రములను చూడగనే బుద్ధుని జీవితమంతయు ఒక్కత్రుటిలో భక్తుని హృదయములో మెఱపు మెఱసినట్టుల నాతని వినమ్రుని, పునీతుని గావించి ఉన్నత భావప్రేరితు నొనరించును.

ఉత్తర హిందూస్థానములోని బౌద్ధస్తూపములలో ఈ కళ్యాణ స్తంభములు కాన్పింపవు. పంచకళ్యాణ స్తంభస్థాపనము బౌద్ధాంధ్రుల యుపజ్ఞయె. బౌద్ధాంధ్రులు చైత్యమునంతను బుద్ధ కథాచిత్రమయము కావించిరి. ఈ చిత్రములను పాలశిల పలకలమీద చెక్కుటలోనే శిల్పకళ వికసించి విస్ఫారినది.

బౌద్ధాంధ్రశిల్పులు బార్హూత్, సాంచీ, శిల్పరూపచిత్రములతో పరిచయము కలిగి భారతీయ శిల్పకళాసంప్రదాయమును ఎఱిగిన వారే. అదివఱకే మధురానగరములోని, గాంధారములోని శిల్పకళ తీరుతీయములను గమనించినవారే. అమరావతీ స్తూపములోని చిత్ర

ములను చిత్రించునపుడు క్రొత్త మార్గములను త్రొక్కి చూచినారు. క్రొత్త పరికల్పనలను చేసినారు. క్రొత్త సంప్రదాయములకు రాచబాట వేసినారు. అందువలననే అమరావతీ శిల్పపద్ధతి, నవ్యతను సంతరించు కొని నూతన సంప్రదాయముగా రూపొందినది. భారతీయ సంస్కృతికి బౌద్ధాంధ్రులు సమర్పించిన కానుక అమరావతీ శిల్పసంప్రదాయమే. బౌద్ధాంధ్రశిల్పి బుద్ధభగవానునకు పట్టిన శిల్పనీరాంజనము ధనకటక మహాచైత్యమే.

తెలుఁగు దేశములోని వేఱువేఱు ప్రాంతములందు వెలసిన బౌద్ధచైత్యములలోని శిల్పకళ అమరావతీ శిల్పకళా సంప్రదాయ మునకు చెందినదే. సాంచీ, బార్హూత్ స్తూపములలో కానవచ్చు శిల్ప చిత్రములకంటె అమరావతీస్తూప చిత్రములు అంగసౌష్ఠములు కలిగి సౌకుమార్య చైతన్యములతో ముద్దులు మూటకట్టు చుండును. అమరావతీ శిల్పచిత్రము కావ్యప్రౌఢిమను సంతరించుకొని కళావిమర్శ కుల ప్రశంసలను అందుకొన్నది.

జాతక కథలు, బుద్ధ జీవితగాథలు, చెక్కునపుడు బౌద్ధాంధ్రశిల్పి రెండు పద్ధతు లవలంబించెను. ఒకటి విశిష్ట పద్ధతి. రెండు వర్ణనాత్మక పద్ధతి. విశిష్ట పద్ధతిలో శిల్పి కథనంతను అనుస్యూతముగా సమగ్ర ముగా కథాంశముల నన్నింటిని చిత్రింపఁడు; తన నైపుణ్య మును చూపుట కవకాశముగల సన్నివేశములను ఘట్టములను మాత్రమే చిత్రించును. వర్ణనాత్మక పద్ధతిలో కథాంశములను వరు సగా ఒకదాని తర్వాత నొకటిగా కొన్ని గడులలో చిత్రించును. అమరావతిలోను నాగార్జునుని కొండలోను బౌద్ధాంధ్ర శిల్పులు ఈ రెండు పద్ధతులను అవలంబించినారు.

భారతీయ బౌద్ధశిల్పము అమరావతిలోనే పరిపూర్ణతకు వచ్చిన దని కళా విమర్శకుల యభిప్రాయము. దక్షిణ హిందూస్థానమున అమరావతి కాలమునకు తరువాత వర్ధిల్లిన శిల్పకళావళ్లరికి అమరా వతియె ప్రాతిపదిక అగు మొదటిపాదు.

అమరావతీ శిల్పము పరిశీలింపగనే మనకంటికి కానవచ్చు మొదటి విషయము ఏకజాతి చిత్రములలోని వైవిధ్యము. ఆ స్తూప శిల్పములలో చెక్కిన శతపత్రపద్మములు వందలకొలది గలవు. ఏశత పత్రమును పరిశీలించినను ఒక దానిని బోలినది మఱొకటిలేదు. పోగర పనిలోనో అలంకారములోనో ఏదో ఒకదానిలో ఏదోకొంత విభేదము కనిపించుచునే యుండును. ఈ విధముగా అమరావతి శిల్పములో చెక్కిన స్త్రీ చిత్రములు అసంఖ్యాకములు. స్త్రీ చిత్రములను మలచుటలో అమరావతీశిల్పి చూపిన కౌశల్యము అద్భుతమైనది. ఒక చిత్రమును బోలి మఱియొకటి లేదు.

అమరావతిలోని స్త్రీ చిత్రములను త్రిభంగిమలో గడరించుటయే శిల్పికి చాలయిష్టము. ఆ త్రిభంగిమము విలాసమును పెంపొందించిన స్త్రీ చిత్రము చూపరకు నయనపర్వము చేయుచుండును. స్త్రీ చిత్రరచనలో అమరావతీశిల్పి సిద్ధహస్తుడైనాడు. మఱొక విశేషమే మనగా ప్రతిచిత్రముభావప్రపూర్ణమై జీవ ముట్టిపడుచునుండును. భావానుగుణముగా చిత్రములను చిత్రించునేర్పు బౌద్ధాంధ్ర శిల్పకారున కలవడినట్లు మఱొకని కలవడలేదు. దుఃఖము, సంతోషము, కరుణము, ఆధ్యాత్మిక మానసికానందము అమరావతీ శిల్పచిత్రముల ముఖములను చూచినంతనే గోచరించును. అందువలననే అమరావతీ శిల్పచిత్రము ఒక అపర్ఘమైన కవితయె.

ఒక్క స్త్రీ చిత్రములేగాదు; బౌద్ధాంధ్రశిల్పి అమరావతీ స్తూపములో చిత్రించిన జంతుచిత్రములు, పుష్పదామములు, చేసినపరికల్పనములు అన్నియు అతని నైపుణ్యమును, బౌద్ధాంధ్రశిల్పపు గొప్పతనమును చాటుచునే యుండును.

**1. అర్థాదులు :**

ముమ్మరముగా = ఎక్కువగా. వర్తులము = గుండ్రని. నీరాంజనము = హారతి. అనన్యాతిముగా = ఎడ తెగనిదిగా. పోగర = శిల్పసంబంధమైన పనిముట్టు. గండరించుట = పుట్టించుట. ధామము = దండ.

(ప్ర. వి. ఫలకము (వి) పలక. చిత్రము (వి) చిత్తరవు. శిల్పి (వి) చిలిపి.

## 2. ప్రశ్నలు :

1. ఈ పఠనీయము రచించిన వారెవరు ?

2. ఈ క్రిందివాని అర్థ సందర్భములు వ్రాయుడి?

అమరావతి శిల్పచిత్రము ఒక అనర్ఘమైన కవితయే. బౌద్ధాంధ్ర శిల్పులు ఈ రెండు పద్ధతులను అవలంబించినారు. స్త్రీ చిత్రరచనలో అమరావతీ శిల్పి సిద్ధహస్తుడైనాడు. బౌద్ధాంధ్ర శిల్పి బుద్ధభగవానునకు పట్టిన శిల్పనీరాంజనము ధనకటక మహాచైత్యమే.

3. "ఈ యన్నింటితో కూడినదే చైత్యము" — ఏ యన్నింటితో ?
ఆర్యక స్తంభము లనగా నెవ్వి? జాతక కథలన నెవ్వి? బౌద్ధగాథ లెవ్వి? పంచ కళ్యాణము లన నెవ్వి ?

## 3. రచన :

మెఱపు మెఱసినట్లయి - ముద్దులు మూటకట్టుట, అసంఖ్యాకములు, గండరించుట - నయనపర్వము, సిద్ధహస్తుడు, చాటుచుండుట - మలచుట.

1. పైపదముల నుపయోగించుచు సొంతవాక్యములు వ్రాయుడి.

2. బౌద్ధాంధ్ర కళాస్రష్టల విశిష్టల సంప్రదాయమును గుఱించి పదిపంక్తులు వ్రాయుడి.

## 4. వ్యాకరణాంశములు :

పునస్ + జన్మ = పునర్జన్మ. శత + అబ్ది = శతాబ్ది. వర్తుల + ఆకృతి = వర్తులాకృతి. జయంతి + ఉత్సవ = జయంత్యుత్సవ. అతి + అద్భుతము = అత్యద్భుతము.

విశుద్ధ వర్తనులు - (విశుద్ధమైన వర్తనము కలవారు) బహువ్రీహి.

# గురు – శిష్యులు

ప్రతాప రామకోటయ్య గారు (శ్రీవివేకానందుడు)

ఈ పఠనీయము "శ్రీవివేకానందుడు" అను గ్రంథమునుండి గ్రహింపబడినది. గ్రంథకర్త శ్రీ ప్రతాప రామకోటయ్య గారు. గుంటూరు జిల్లాబోర్డువారి సంబంధించిన వేమన ఉన్నతపాఠశాలలో తెలుగు పండితులుగా నున్నారు.

శ్రీ వివేకానందుడు, విభ్రాంతి, వధూ రాదర్శము లోనగునవి వీరి యితర గ్రంథములు.

"ధర్మసంస్థాప నార్థాయ సంభవామి యుగేయుగే"

అని శ్రీకృష్ణ భగవానులు సెల విచ్చి యున్నారు. ఈ పరమార్థము యుగ యుగముల నుండియు మనకు ప్రత్యక్ష మగుచునే యున్నది. ఆత్మద్రష్టలై ప్రపంచమున వెలుగు కాంతులు వెదజల్లిన ఉపనిషదృషీశ్వరులును, దివ్యబోధలచే లోకమునకు మనశ్శాంతి ప్రసాదించిన శ్రీకృష్ణభగవానుడును ఆశోపహతులైన దీనమానవాళిని సముద్ధరించుటకై జ్ఞానజ్యోతిని వెలిగించి, నిర్వాణమునకు రాచబాట నిర్మించిన బుద్ధభగవానుడును మానవులను ప్రేమ సౌదర్యాద్యుత్తమగుణసంపన్నులఁ జేయుటకు అనవరత కృషి యొనర్చిన ఏసుప్రభు మహమ్మదు ప్రవక్తలును ధర్మసంస్థాపనార్థము అవతరించిన మహానుభావులే.

మన భరతవర్షము ఉపనిషదృషీశ్వరుల ఆధ్యాత్మిక జీవనవైభవమును జ్ఞానసందేశములను మఱువక, తత్ సంప్రదాయ స్రవంతిని యుగయుగముల ప్రవహింపఁజేయుచునే యుండెను. విశేష మేమన, కారణాంతరములచే భరతవర్షము దుర్భర దాస్యాంధకారమగ్నమై ఆర్థిక రాజకీయ సౌష్ఠవములను గోలుపోయియు, ఆధ్యాత్మిక జీవన వైభవ సంప్రదాయములను మాత్రము చెక్కు చెదరకుండ నిలుపుకొన గలిగెను.

అది పందొమ్మిదవ శతాబ్ద మధ్యభాగము. భారతవర్షము ఆంగ్ల సామ్రాజ్యరథమున అంటకట్టబడి,స్వతంత్ర గమనమును పూర్తిగా గోలుపోయెను. దాస్యమహాభారముచే దేశమాత క్రుంగిపోవుచుండెను. హిందూసంఘము ఆత్మవిశ్వాసమునసేగాక ఆత్మశక్తినిగూడఁ గోలుపోవుచున్నదా! యను స్థితిలో నుండెను. ముఖ్యముగా దక్షిణభారతమున అస్పృశ్యతా పిశాచము యథేచ్ఛముగ కరాళనృత్య మొనరించుచుండెను. భరతవర్ష మంతయు దారిద్ర్యదేవతకు నిలయ మయ్యెను. ఛాందస వాదములు వామాచారములు మితిమీఱిపోయినవి. అవియె సనాతన ధర్మసంప్రదాయము లని భావింపఁబడుచుండెను.

పాశ్చాత్య నాగరికత మన మాతృ దేశమును ముంచి యెత్తివేయుచుండెను. దీనికితోడుగా మన విజేతలు భారతజాతి పతితజాతి యనియు, సనాతనధర్మము వ్యర్థప్రలాప మనియు ప్రచారముచేయ మొదలిడిరి. భారతీయ జనసామాన్యమెగాక, విద్యాప్రపూర్ణులైన మన మహాజనులును, పై ప్రచారమును సత్యమని భావించి, పాశ్చాత్య నాగరకతను, దానికి మూలకందమైన ఐహికభోగములను పరమార్థములను బుద్ధితో అనుకరింపసాగిరి. పాశ్చాత్య నాగరకతయే ఏకైక శరణ్యమని నిశ్చయించుకొనిరి.

భారతజాతీయ జీవితమునందలి ఈ క్లిష్ట ఘట్టమున ఒక యిరువురు మహనీయులు అవతరించిరి. ఒక్క శతాబ్దములో పతిత భారత సంఘమును సముద్ధరించిరి. భారతీయులనే గాక ప్రపంచ జనులను సైతము తమ ఆధ్యాత్మిక శక్తిచే దివ్య సందేశములచే పరిశుద్ధుల నొనర్చిరి. సనాతన ధర్మ సంస్థాపన మొనర్చిరి. వారి దివ్య లీలలు, దివ్యానుభవములు, దివ్య శక్తులు తలచుకొన్న కొలంది మనస్సులతో బాటు దేహములును పులకాంకురితములై పోవును. వారిరువురే శ్రీ రామకృష్ణ శ్రీవివేకానంద యతీశ్వరులు. నరనారాయణాంశ సంభూతులు. అద్వంద్వులై గురు శిష్యులై పతిత జగత్తును సముద్ధరించుటకు అవతరించిన వారు. ఆ దివ్యమూర్తులు జన్మించిన విధానమును అభివృద్ధి నందిన రీతియు లోకకళ్యాణార్థము పాటుపడిన విధానమును గమ

నించిన వారి లీలలు ఏక జీవితమునందలి పూర్వాపర భాగములని నిర్ణయింపవచ్చును. అవి పరస్పరాశ్రయములై పరిశోభించి పరిపూర్ణత నందినవి.

రామకృష్ణ పరమహంస యొక్క శాంతి మహోనముద్ర మగుచో వివేకానందుఁడు అందలి మహోత్తుంగ తరంగ సంచయము. పరమహంస యొక్క మహా సమస్య యగుచో వివేకానందుఁడు తత్ పూరణము. పరమహంస యొక్క గురుదేవుఁ డగుచో వివేకానందుఁడు ఒక శిష్యబ్రహ్మ. పరమహంస పవిత్ర గంగానది యగుచో వివేకానందుఁడు తత్ పుష్టి తుష్టి కారకమగు యమునా స్రవంతి.

అయ్యిరువుర శుభ సమ్మేళనముచే జగము సముద్ధరింప బడినది. లోకకళ్యాణము రమణీయముగ సాధింపబడినది. వారిరువురి గురుశిష్యత్వము లో ప్రాచీనాధునాతన సంప్రదాయములు శుభసమ్మేళన మందినవి. సనాతన ధర్మమునందు అధునాతన సంప్రదాయములు కలిసిమెలసిపోయినవి. అట్టి మహనీయుల జీవిత విశేషములను తెలిసికొనుట అత్యావశ్యకము గదా ?

## 1. అర్థాదులు :

ఆత్మద్రష్టలు = బ్రహ్మజ్ఞానముగలవారు. స్రవంతి=నది. పులకలు = రోమాంచములు. సనాతనము=ప్రాచీనము. అధునాతనము=ఇప్పటిది. ధర్మము= న్యాయము, పుణ్యము, యజ్ఞము, విల్లు. ఋషి=జ్ఞానము పొందినవాఁడు.

తరంగము (వి) తరగ. సముద్రము : సంద్రము. యమున (వి) జమున.

## 2. ప్రశ్నలు :

1. గురుశిష్యుల పుట్టుక నాటికి భారతదేశ స్థితి యెట్లుండెను ?
2. వారు భారతదేశము నెట్లుద్ధరించిరి ?
3. అని పరస్పరాశ్రయములై పరిశోభించి పరిపూర్ణత నందినవి. ఏవి ? ఎట్లు ?

**3. రచన :**

వీనిని సొంతవాక్యములలో ఉపయోగించునది.
చెక్కు చెదర కుండుట, యథేచ్ఛము - కరాళనృత్యము.

**4. వ్యాకరణాంశములు :**

ఉపనిషత్ + ఋషి + ఈశ్వరులు = ఉపనిషదృషీశ్వరులు. మనస్ + శాంతి = మనశ్శాంతి. ఆశా + ఉపహతులు = ఆశోపహతులు. అది + ఉత్తము = అద్యుత్తము. ఏక + ఏక = ఏకైక. మహా + ఉత్తుంగ = మహోత్తుంగ.

దుగాగమము, టుగాగమము, నుగాగమము, లెపుడు ఎట్టుల వచ్చునో సూత్ర సాహాయ్యముతో దృష్టాంతరము లిచ్చుచు వివరించునది.

1. సమా: అంధకారమగ్న - స. తత్పు.
   శుభ సమ్మేళనము - కర్మధారయము
2. పఠనీయము నందలి మూడు సమాసములను గుర్తించి, వాని విగ్రహ వాక్యములువ్రాసి నామముల దెలుపునది.

—

# ౨. జాతీయ జీవనము – వాఙ్మయము

శ్రీ కోరాడ రామకృష్ణయ్యగారు, ఎం. ఏ.,

ఇది శ్రీ రామకృష్ణయ్య పంతులుగారి సారస్వత వ్యాసములలో నొకటి. వీరిట్టి వ్యాసములను బెక్కింటిని వ్రాసి ప్రచురించిరి వీరు మదరాసు విశ్వకళా పరిషత్తునందుఁ జాలా కాలము పరిశోధక శాఖయందుఁ బనిచేసిరి. ప్రస్తుతము తిరుపతి యందలి ప్రాచ్య విద్యాసంస్థయందుఁ బనిచేయుచున్నారు. ఆంధ్ర మహాభారత కవితా విమర్శనము- సంధి మున్నగు గ్రంథములు వీరిచే రచియింపఁబడి పెక్కు పట్టపరీక్షలకుఁ బఠనీయ గ్రంథములుగా నిర్ణయింపఁబడెను. వీరి విమర్శనములు సునిశితములు; తత్త్వనిర్ణయ దక్షములు.

1. వాఙ్మయము దేశచరిత్ర జ్ఞాన సంపాదనమునకు తోడ్పడు నట్లే దేశచరిత్రయు వాఙ్మయాభివృద్ధికిం దోడ్పడెడి యాయా కారణముల నిరూపింప సమర్థంబై యుండును. చరిత్రకన్న వాఙ్మయమున నొక్క విశేషము కలదు. చరిత్ర యాయా దేశములం గల్గు వివిధోద్యమములను వాని వికాసమును అచ్చటి రాజకీయార్థిక సాంఘిక నైతిక స్థితులను వర్ణించి, ఆ యా యుద్యమంబులకును వాని పరిణామములకును కారణముల నారసి నిరూపించుచుండ, ఈ వాఙ్మయ మట్టి యుద్యమ కారణంబులకు మూలంబులగు జనుల భావోద్రేకములను, వారి యంతఃకరణంబులను విశదపఱచును. మఱియు నిది దేశమునఁ గలిగిన రాజకీయ విప్లవముల వలనఁగాని, అన్యదేశీయ భాషా సంసర్గము వలనఁగాని ఆ జాతీయ జీవనమునఁ గలిగిన మార్పులను గూడ విస్పష్టంబుగఁ దెల్పుచుండును. కావున, వీని సంబంధం బతి సన్నిహితంబని యెన్నఁదగి యున్నది.

2. ఇందులకుఁ దార్కాణముగ నిప్పుడు మన దేశమున బాగుగా వ్యాపించి మిగుల నెన్నికగన్న యాంగ్ల వాఙ్మయముఁజూడ నగును. ఆ దేశమున జాతీయజీవన మే కాలమున నెట్లు మాఱుచు వచ్చెనో తదనుగుణంబుగనే కవితయందలి రుచియు మాఱుచు

వచ్చెను. ఈ కవితా రుచికి తగినట్లుగనే విమర్శన పద్ధతులును ప్రబలినవి. అప్పుడేయే భావము లా దేశీయుల మనముల నాకర్షించి యుద్రేకము గల్గించు చుండినవో అవియే యా యుగమందలి కవిత యందును స్ఫురించుచుండినవి. ఆంగ్లదేశమున పదునాల్గవ శతాబ్దమునకుఁ బూర్వము వాఙ్మయమున చేరఁదగిన కవిత మిగుల స్వల్పమని చెప్పనగును. ఈ 14 వ శతాబ్దమందలి తన దేశీయుల స్థితిగతులను, మతాచారముల దుస్థితిని భాషా వైఖరిని దెల్పుచు 'ఛాసరు' అను కవి 'కాంటర్ బరీ కథలు' అను గ్రంథమును రచించి యున్నాఁడు. పదునాఱవ శతాబ్దమున ఆంగ్లదేశీయ నావిక శిఖామణుల యద్భుత యాత్రల వలనను, వారిచేఁ గనుగొనఁబడిన నూతన ఖండముల పరిజ్ఞానము వలనను వారికి సముద్రములు స్వాధీనమై వారు పరదేశములతో సులభముగ వ్యాపారము చేయఁ గలుగుటచే దేశమెుక్క మాఱుగ ధనవంత మగుట వలన దేశీయులకుఁ గలిగిన యపరిమితానందోత్సాహముల యొక్క ఫలమో యన్నట్లా కాలమున షేక్స్పియర్, సిడ్నీ, స్పెన్సర్ మొదలగు మహాకవీంద్రులు బయలువెడలి, తమ యా యుత్సాహము నప్రతిమానంబగు కవితా రూపమున వెలయించి యాంగ్ల వాఙ్మయమున నగ్రపీఠిక నలంకరించిరి తరువాత పదునేడవ శతాబ్దము మాధ్యమున దేశమున సంభవించిన రాజకీయమును మత విషయకములు నగు కల్లోలముల నన్నిటిని నా కాలమున కవి సార్వభౌముఁడగు మిల్టన్ వ్రాసిన గ్రంథములనుండి బాగుగఁ దెలిసికొన వచ్చును. మఱియు నీ శతాబ్దము యొక్క యుత్తర భాగమున ప్రజా ప్రభుత్వము పోయిన పిదప నాంగ్ల సింహాసనము నధిష్ఠించిన రెండవ ఛార్లెసునకు ఫ్రెంచి దేశముతో సంబంధమును, దానియం దభిమానమును గలుగుట వలన నా దేశీయులగు మాల్హార్బీ బాయిలూ మొదలగు వారి కవితా రీతులను విమర్శన పద్ధతులను ఈ దేశమున వ్యాపించి యిచ్చట కవితా పద్ధతులనుగూడ మార్చినవి. దీనితో కవితయందలి పూర్వపు రుచిమాఱి కవితా ప్రవాహము మాఱు త్రోవఁబట్టినది. అప్పటి కవులు భావనాశక్తిని గొలుచుట మాని,

అతి విశదంబును వ్యక్తంబును నగు శైలిలో నా కాలమునఁ బ్రబలిన జీవన పద్ధతులను, కాఫీ క్లబ్బులను, చీట్లాటలను, పానగృహములను గూర్చి చమత్కారముగ వర్ణింపఁ జొచ్చిరి. తమకాలపు జీవన పద్ధతులను నభిప్రాయములను బట్టి చూచుటచే, వారికి షేక్స్పియరు మొదలగు వారికి కవితలయం దాదరము లేకుండెను. పదునెనిమిదవ శతాబ్దమున నైరోపా దేశము నెల్ల నొక్కమాఱుగా కలఁత నొందించిన గొప్ప రాజకీయ విప్లవము ఫ్రాన్సు దేశమున బయలుదేరినది. దీనికి వ్యక్తి స్వాతంత్ర్యము, విశ్వజన సౌభ్రాత్రము మొదలగు నుదార భావంబులు జనుల మనంబులం దుదయించుటయే ముఖ్య కారణము. ఇంగ్లాండు దేశమునకుఁ గూడ నీ నూతన భావములు ప్రాఁకినవి. ఇచ్చట మహాకవుల మనంబులును అట్టి గంభీరభావములతో పొంగి పొరలినవి. మరల కవితయందలి రుచిమాఱి, పూర్వ కవితయందలి ప్రాచీనమగు దేశచరిత్రయందును నాదరము హెచ్చినది. 17–వ శతాబ్దమునఁ బ్రబలిన కవితా పద్ధతులపై నాదరము పోయినది. ప్రకృతియే వీరి నూతన భావములకును కవితకును గూడ నుద్బోధకంబయ్యెను షెల్లీ, బైరన్, కోలరిడ్జి, వర్డ్సువర్తు మొదలగు వారీ స్వాతంత్ర్యాదర్శమును ప్రకృతి వైచిత్ర్యములను అనేకరీతులఁ గొనియాడి యాంగ్ల వాఙ్మయమున మరల సహజ కవితను నెలకొల్పి యొక నూతన యుగ మేర్పఱచిరి. 19–వ శతాబ్ద మాంగ్లదేశమున నొక గొప్ప పారిశ్రామిక యుగమని చెప్పవచ్చును. ప్రకృతిశాస్త్రము విశేషముగ నభివృద్ధి గాంచినది. జాతీయజీవన మనేక విధములై పర్వినది. దీనిని వాఙ్మయమున నెలకొల్పుటకు నవలలు విశేషముగ నభివృద్ధి గాంచినవి. తోడ్పడినవి. యంత్రాగారములలోఁ బ్రబలిన కొన్ని యమానుష కృత్యంబులను సంస్కరించుటకు లేడీ బ్రౌనింగ్, డికెన్సు మొదలగువారి వ్రాఁతలు సహాయపడినవి. టెనిసన్ మహాకవీంద్రుఁడా కాలపు దేశోద్ధారకులను గొనియాడి యనేక విధములగు యుగధర్మములను కవితయందు నెలకొల్పి, ఈ యుగమునకు వాఙ్మయమున శాశ్వత పదవిని కల్పించినాఁడు. కావున ఆంగ్ల వాఙ్మయ పఠనంబున

నేయే యుగముల నేయే ధర్మములు ప్రబలినవో ఆ జాతియొక్క జీవన పద్ధతు లేయే రీతుల మార్పు చెందినవో కనుఁగొనుట సులభ సాధ్య మనుమాట విశదమే యగుచున్నది గదా !

3. ఇఁక హైందవ విజ్ఞానమున కంతకును మూలాధారంబగు సంస్కృతభాష వాఙ్మయ మా జాతీయభావము నెట్లు స్ఫురింపఁజేయు చున్నదో చూతము. ఏ తత్పరిశీలనావిషయమున నాంగ్ల వాఙ్మయమున కును సంస్కృత వాఙ్మయమునకును నొక్క భేదము కలదు. ఆంగ్లభాష యందు తద్దేశచరిత్రను దెలుపు ననేక గ్రంథములు కలవుగాని, సంస్కృతవాఙ్మయము మిగుల ప్రాచీనమగుటవలనను, అప్పటికాలపు చరిత్రను దెల్పు నితరాధారములు లేకుండుటవలనను, ఉన్న వాఙ్మయ మును బట్టియే మన మా కాలపు చరిత్రను నిర్ణయింపవలసియున్నది. ఇప్పటికి నాలుగైదువేలయేండ్లనుండి వచ్చిన వాఙ్మయమునుండియే, మన మా కాలమున నివసించియుండిన హైందవజాతియొక్క స్థితిగతు లను, వారి నాగరికతను దెలిసికొనఁగలుగుచున్నా మను విషయమే జాతీయజీవనమునకును, వాఙ్మయమునకును గల సన్నిహితసంబంధము నకుం బ్రబల బగు నిదర్శనము. హైందవ విజ్ఞానమునకు మూలములగు వానిలో ప్రాచీనతమంబులగు ఋగ్వేదమంత్రము లితరదేశములలో నాగరికతా గ్రంథమే లేని కాలపునాఁటి హైందవుల నాగరికతాగరిమను చాటుచున్నవని పెద్దలు చెప్పుచున్నారు. చారిత్రక దృష్టితోఁ బరిశీ లించినపుడు హిందూ ర్యుల నాగరికత ఋగ్వేదకాలమునఁ బసితనమున నున్నదనియు, అప్పుడు వారిలో కొంతమంది వ్యవసాయమువలన జీవించుచున్నను, చాలమంది పశుచారణోపజీవులనియు, మంత్రరచనా సమర్థులగు బ్రాహ్మణులే విల్లంబులను పూని తమ శత్రువులతో పోరాడు చుండెడివారనియు, స్త్రీలు కూడ మంత్రములు రచించుచుండెడివా రనియు, వారు బట్టలను నేసికొనుచుండెడివారనియు, ప్రకృతియందు గోచరములగు వైచిత్ర్యములనే వా రారాధించెడి వారనియు, తదారా ధనారూపములే యీ ఋగ్వేదమంత్రము లనియుఁ దెలియవచ్చు చున్నది. కాలక్రమమున నిట్టి యారాధనయందు శ్రద్ధ తగ్గినకొలఁదిని

ఆ జనులకు క్రతువులం దాదరము హెచ్చుటయు ఈ క్రతువిధానముల నుద్గాత్రధ్వర్యులకు విధింపఁబడిన కార్యక్రమము ననుసరించి వీరు పఠించ వలసిన మంత్రసముదాయమే సామ యజుర్వేద రూపంబులు చెందినట్లును, వీ రీ కార్యక్రమమును నడుపవలసిన రీతులను ఆ యా సంహితల యొక్క యాంతర్యార్థమును దెల్పు గద్యరూపంబులైన వ్యాఖ్యానంబులే బ్రాహ్మణములనియుఁ గూడ తెలియవచ్చుచున్నవి. ఈబ్రాహ్మణముల కాలము వీరి జాతీయ జీవితమునను వాఙ్మయమునను గూడ రెండవ యుగమని చెప్పవచ్చును. ఈ కాలమున నార్యులు కర్మపరులును, తత్త్వవిచారణవ్యగ్రులునై యుండిరి. ఇప్పుడే వర్ణధర్మములు గూడ ప్రబలినవి; వార్ధకమున జను లరణ్యములలో వసియించుట యనెడి యాచారము వాడుకలోనికి వచ్చినది. బ్రాహ్మణాంతర్గతములైన యారణ్యకము లను భాగములు తత్త్వవిచారణ రూపంబులును, నుపనిషత్తులకు మూలభూతంబులు నై వెలసినవి. ఇవన్నియుఁ బూర్వ యుగమందలి మంత్రములవలె ఛందోబద్ధములుగాక గద్యరూపంబుననే రచియింపఁబడినవి పిదప నుపనిషత్తుల యుత్కర్ష హెచ్చి కపిలుఁడు సాంఖ్యదర్శనమును వ్యాపింపఁజేయునప్పటికి ఋత్విక్కులప్రాబల్యము తగ్గినది. ఇది మూఁడవ యుగము. ఈ కాలమున సంహితాబ్రాహ్మణముల యందలి యంశములను సులభముగ బోధపఱచుకొనుటకుఁగాను వానిని క్లుప్తపఱుపవలెనను బుద్ధితో సూత్రములను వెలయించిరి. ఇంకను వివిధశాఖల హైందవ విజ్ఞానమంతయు సూత్రములలోనికి వచ్చినది. నాగరికత హెచ్చినది. వాఙ్మయము వృద్ధిచెందినది. వైదిక కర్మ కలాపంబంతయు శ్రౌతసూత్రముల నింపఁబడినది. ఆచార వ్యవహారములు నిర్ణయించుటకు గృహ్యసూత్రములు, పరిపాలనాక్రమమును దెలుపుటకు ధర్మసూత్రములు, ప్రాతిశాఖ్యలు, శిక్షాసూత్రములు, పాణిని వ్యాకరణ సూత్రములు, ఛందస్సూత్రములు మొదలగునవి బయలు దేఱినవి. హైందవ విజ్ఞానమునకంతకు నలంకారభూతంబు లగు షడ్దర్శనములును బయలు దేఱినవి. ఇవి యన్నియు నా కాలమందలి హిందువుల యాత్మజిజ్ఞాసను అగాధంబగు బుద్ధిబలంబును వారి నాగరి

కతా వికాసంబును వేనోళ్ళ చాటుచున్నవి. ఈ కాలమున సాంఘిక జీవనమునకుఁ బెక్కు మార్పులు జరిగినవి. ఋగ్వేదమతమునం దావేశము తగ్గినది. త్రిమూర్తులు మొదలగు ననేక దేవతలు వెలసిరి. అర్థము లేని కర్మలు ప్రబలినవి. జాతివైషమ్యములు నంత్యజాతియం దనాదరము నంకురించినవి. ఇట్టిసమయమున గౌతమబుద్ధుఁడు బయలుదేఱి, వర్ణభేదమువలన గొప్పతనము రాఁబోదనియు, సత్ప్రివర్తన వలన నందఱు ముక్తిపడయఁగలరనియు, జీవహింస కూడదనియు- నీ మొదలగు బోధలు చేయుటచే, జనసామాన్యము నొక్కసారిగా నాకర్షింపఁ గలిగెను. అప్పటినుండియు బౌద్ధ మంతకంతకు వృద్ధిచెంది అశోకుని కాలమున దిగంతవ్యాప్తిచెంది హిందూమతము నణఁచివేసినది. పిదప, హిందూదేశము పరదేశీయుల దండయాత్రలకు లోనై చాలకాలము వఱకు శాంతిలేకయుండెను. మరల విక్రమాదిత్యుని పరిపాలనమునఁ గొంత శాంతి గలుగుటచే హిందూమతముకూడఁ గొంత తలయెత్తుటకును, కాళిదాసాది మహాకవుల కవితా విజృంభణమునకుఁ గొంత యవకాశము దొరికినది. కాని, క్రమక్రమముగ సామాన్యజనులలో విద్యావ్యాప్తి తగ్గుచుండుటచేతను, దేశము మహమ్మదీయుల కధీనమైన పిదప జాతీయభావమే నష్టప్రాయ మగుటవలనను, తరువాతి కవితకును జాతీయజీవనమునకును నంత సంబంధ మున్నట్లు కనఁబడదు. సహజ కవిత తగ్గినకొలఁది కవితా విమర్శన ప్రబలి యాలంకారిక గ్రంథములు బయలువెడలినవి. ఈ యాలంకారికుల నిబంధలను దాఁటిపోకుండుట కూడ కవుల కాచారమైనది ఇట్లు హైందవ వాఙ్మయము ప్రాచీనార్యుల జాతీయజీవన పద్ధతిని విశదము చేయుచునే యున్నది.

4. ఇంతకు పూర్వము చాలకాలము క్రిందటనే యార్యులు దక్షిణహిందూస్థానమునకు వచ్చియుండుటచే హైందవ విజ్ఞాన మచ్చట వ్యాపించుటేగాక క్రమముగఁ గొంత కాలమునకు సంస్కృత భాషా సంపర్కము వలన దేశభాషలయందు వాఙ్మయాభివృద్ధికి చేయూఁత దొరికినది. చాలాకాలము వఱకును సంస్కృత ప్రాకృత భాషలయందే రాజకీయ వ్యవహారములు జరుపఁబడుట వలన దేశభాష లభివృద్ది

చెందుటకు వీలులేకున్నను, క్రీ. శ. 7-వ శతాబ్దము ప్రాంతమున వేఁగి దేశమును జయించిన చాళుక్య ప్రభువులు దేశి కవిత నీ దేశమున నెలకొల్పినట్లు నన్నెచోడ మహాకవి తన కుమారసంభవ కావ్యము నందు—

"మును మార్గ కవిత లోకం
బున వెలయఁగ దేశికవితఁ బుట్టించి తెనుం
గున నిలిపి రంధ్ర విషయం
బున *జన చాళుక్యరాజు మొదలుగ పలువుర్."

అను పద్యమునఁ దెల్పియున్నాఁడు. ఇట్లు సత్యాశ్రయునిచే నాటఁబడిన కవితావృక్షము సంస్కృతభాషా వాఙ్మయములను దోహదముచే క్రమముగ వృద్ధిచెంది రాజ నరేంద్రుని నాఁటికి పుష్టి గాంచి యమూల్యమగు ఫలముల నిచ్చినది. సంస్కృత వాఙ్మయమే దేశమున నెక్కుడాదరము వహసియుండుట చేతను, పండితులు కవులు నగువారీ భాషయందే యభిమానముకలవారౌటచేతను, దేశభాషలోని దేశీయ కవిత అప్పటి సంస్కృత పండితుల యాదరమును బడయ గల శిష్ట కవితను పుట్టించునంతటి స్థితిలోనికి రాకుండుటచేతను, సంస్కృత గ్రంథముల భాషాంతరీకరణములే ప్రథమమున నీ దేశీయ వాఙ్మయమున బయలుదేఱిన గ్రంథము లగుట తటస్థించియుండును మఱియు నప్పటికి బాగుగ దేశమున వ్యాప్తి చెందినట్టియు, సామాన్య జనులలో నన్ని విధములగు హైందవ ధర్మంబులను వ్యాపింపఁ జేయు నుద్దేశముతో బయలు వెడలినట్టియు, సకల విజ్ఞానంబులకు నాలవాలంబైనట్టియు భారతేతిహాసంబును పురాణంబులను దేశభాషలోనికిఁ దెచ్చిననే, తిక్కనసోమయాజి చెప్పినట్లు "భారతామృతముఁ గర్ణపుటంబుల నారఁగ్రోలి యాంధ్రావళీ మోదముం బొరయఁగల్గు"నని యప్పటివారు తలంచి యుండుటచేతనే, యీ యుగ మాంధ్ర వాఙ్మయమున భాషాంతరీకరణ యుగమై వెలుఁగొందినది. కాని, ఈ యుగమున కంతకును, ఈ యుగమున కేమి - ఆంధ్ర వాఙ్మయమున కంత

* సత్యాశ్రయుని తొట్టి చాళుక్య నృపుల్.

కును అలంకారంబగు నాంధ్రభారతము కేవలాంధ్రీకరణమని చెప్పుట సమంజసము కాదు. దీనిని కేవలాంధ్రీకరణముగ భావించి మూలముతో నచ్చటచ్చట సరిచూచి ఆ యా పట్ల మూలముకన్న కొంత భేదముగ నుండుటను బట్టి, ఎక్కువ రసవంతముగను రమణీయముగను నుండుటను గనుఁగొనియు, పూర్వపు ప్రమాణము చేతనే దీనిని విమర్శించి మూలమునకుసరిగ లేదని కొంద ఱాక్షేపింతురు. కాని యొక విధమగు దోషముగ నెన్నంబడుచున్నను ఈ గుణమే దీని యుత్కృష్టతకుఁ గారణము. కావున భాషాంతరీకరణ మైనను, ఈ గ్రంథమును మూలముకన్న రసవంతముగను రమ్యముగను జేయునుద్దేశముతోడనే తిక్కనాదులు కొంతస్వాతంత్ర్యమును దీసికొనియుండిరి. కావున, నీ యుగముననే రాఁబోవు యుగమునందలి స్వతంత్రగ్రంథముల చిన్నెలు కొంతవఱకు పొడసూపి యుండినవని చెప్ప నొప్పును. మొత్తముమీఁద నీ యుగమునందు మతాభిమానమే వాఙ్మయ ప్రవాహమును నడపినదని చెప్పవచ్చును.

5. క్రమముగ కవులకీ భాషయం దభిమానము హెచ్చుటయు, నట్టి భాషాంతరీకరణములఁ జేయుటయేగాక తమ స్వతంత్ర కల్పనాశక్తిని వర్ణనాచాతుర్యమును ఎక్కుడుగ చూపవలె ననెడి యభిలాష బలమగుటచే మూలగ్రంథములనుండి కథను గొన్ని కల్పనలను మాత్రమే తీసికొని స్వకల్పనలచే పెంచి భాషాంతరీకరణమునకు స్వతంత్ర గ్రంథమునకును మధ్యస్థముగ నుండునట్లు చేయుచు వచ్చిరి. దీనికి శ్రీనాథుఁడే ముఖ్యోదాహరణము. ఈతనిని భాషాంతరీకరణ యుగమునకును కావ్యయుగమునకును నడుమ రెంటిని కలుపుచుండెడి యొక వంతెనకుఁ బోల్చవచ్చును. 14-వ శతాబ్దిప్రారంభమున ప్రతాపరుద్రదేవుని యాస్థానమున నుండిన విద్యానాథుఁ డను సంస్కృత కవి వలెనే అతని మంత్రులకుఁ గాని దండనాథులకుఁ గాని కృతి యిచ్చిన మారన, మంచన, భాస్కరకవి మొదలగువారి గ్రంథములవలన నా కాలపుస్థితిగతులు తెలిసికొనగలిగినట్లే, పదునైదవ శతాబ్దమున నున్న శ్రీనాథుని గ్రంథముల వలన నా కాలమందలి రెడ్ల చరిత్రను నాంధ్ర

జనుల స్థితిగతులను గూడ విశేషముగాఁ దెలిసికొనఁ గలుగుదుము. తరువాత 16-వ శతాబ్దమున నాంధ్రదేశమందు వలెనే కృష్ణదేవరాయలు భుజపీఠిక నలంకరించి మహోన్నతపదవి నొందిన యాంధ్ర భూమి యందు నొక నూతన వికాసము గలిగి రాజకవియు కవిరాజును నగు నాతని ప్రాపున కవితాసతి నూతన తేజంబు వడసినది. ఈ కాలమున నాంధ్రదేశమందు వలనే యాంధ్రసారస్వతమునను స్వాతంత్ర్యగుణము నెలకొల్పఁబడినది. సంస్కృత గ్రంథములను దెనిఁగించుట మాని యే పురాణమునుండియో యొక గాథను తీసికొని దానిని తద్రచన కను కూలమగునట్లు పెంచి రసవంతములగు స్వతంత్ర కావ్యములను రచించుటకుఁ బ్రథమమున దారితీసినవాఁడు రాయల యాస్థానకవి యగు పెద్దనార్యుఁడు. ఇంక నీ యాస్థానమున నుండి యష్టదిగ్గజములని పేరు వడసిన ముక్కు తిమ్మనాదులీదారి నేపోయి యనేకములగు స్వతంత్ర ప్రబంధముల నాంధ్రవాఙ్మయమున కలంకారములుగఁ జేసిరి. కృష్ణ దేవరాయలు దక్షిణహిందూస్థానము నేలినరాజు లందఱిలో గొప్పవాఁ డనియు నాతని పరాక్రమము వైదుష్యము కవిజనంబులయెడ నాత నికిఁ గల యాదరమునే గాక యప్పటి జనుల జీవిత పద్ధతులు, భావములు మొదలగు విషయముల నా కాలపు పెద్దన, తిమ్మన, మల్లన, ధూర్జటి మొదలగువారి కవితలనుబట్టి మనము గ్రహింపఁగలము. ఇట్లే ఇఁక తరువాతి కవులు గూడ పెద్దన చూపిన ప్రబంధసరణినే గతాను గతికముగ ప్రవర్తించుటచేతను, తమ పాండిత్య ప్రకర్ష చూపుటయే ఆ కాలమున నొక గుణముగ పరిగణింపఁబడుటవలనను, క్రమముగ కవితకు వికాసము తగ్గుటయేగాక ఆ కవిత యా యా కవుల కాశ్రయులగు వారి వంశచరిత నొక్కింత మనకుఁ దెల్పుచుండెనేగాని, ఆంధ్రదేశము నందలి జనసామాన్యముయొక్క స్థితిగతులను తెలుప సమర్థంబగుట లేదు. ఇది యది యననేల? సామాన్యము నాంధ్రవాఙ్మయమంతయు నట్టిదయని చెప్పవచ్చును. ఇంతకు నీ దేశము నందలి కవిత రసజ్ఞులగు కొందఱు రాజుల పోషణము వలన వృద్ధిచెందిన దగుటవలన నాకవులును తమ కాశ్రయులై తమ్ము పోషించుచున్నవారి ప్రభావంబును,

వంశావళియుఁ గొంత వర్ణించి యాశ్వాసాంతముల మఱిరెండుమూఁడు బిరుదావళులు చదువుచుండుటయేగాని వారి కా రాజ్యమందలి జనుల యొక్కగాని సామాన్యముగ నాంధ్రజాతియొక్క గాని స్థితిగతుల యాశయముల వర్ణించిచెప్పుట కుత్సాహమే కలుగలేదు. దీనికికారణ మాంధ్రజాతీయ స్వాతంత్ర్యము కొంతకాలమైన నెడతెగక లేకుండు టయే. కొందఱు రాజు లాంధ్రకవుల నాదరించి యాంధ్రవాణి నుద్ధరించినను, దేశమున శాంతి తక్కువ యగుటచే జాతీయజీవనమున కంతగా ప్రోత్సాహము లేకుండెను. రాజుల యాస్థానములలోఁ దమ కాలమును గడుపుచుండిన కవిరాజులకు సామాన్యజనులతో విశేష పరిచితి గాని, వారిభావములను ఆదర్శములను పరిశీలించుటకుఁ దగిన యవకాశముగాని యున్నట్లు కనఁబడదు. మఱియు సామాన్యజనులలో విద్యావ్యాప్తి శూన్యప్రాయం బగుటంజేసి యిట్టి పరస్పర సంబంధము నకు వీలు దొరకినది కాదు. కావున అప్పటి రాజులును వారి మంత్రులును సామాన్యముగ యశోలుబ్ధులగుటచే కవిరాజుల సంకీర్తనంబున తమ పేరు శాశ్వతంబుగ నుండునని తలఁచి వారివలనఁ గృతులు గొను చుండిరి. కవులును దమ్మాదరించువారు లేక వారిప్రాపున చేరి వారి గుణములు సంకీర్తనము చేయుచు, కథాభాగమున కే పురాణము నుండియో యొక విషయమును దీసి దానియందే తమ చాతుర్యం బును వెలయింపఁ జూచిరి. కావున, వీరి గ్రంథములలో సాధారణ ముగా మనకు దినచర్యయందుఁ గనఁబడెడి మానవజీవితంబును మనో వృత్తులను భావంబులును గనఁబఱుపక పూర్వయుగములఁ బ్రసిద్ధి చెందిన కించిదతిమానుష ప్రభావము గలవారి చర్యలను వారి యాకారములను మన యెదుట నిల్పి, మన కున్నతాదర్శములను బోధించుచుండిరి. వాఙ్మయముయొక్క ముఖ్యప్రయోజనము మానవ జీవిత ప్రతిపాదనముగాని నైతికమార్గ ప్రతిపాదనము మాత్రమేకాదు. ప్రతిభావంతుఁ డొకఁడు మానవ జీవితమును బాగుగఁ బరిశీలించి, ఆ యా జనుల యవస్థలను ఆ యా స్థితులవారి భావములను ఒక్కొక్క విషయమున వారి కనుభవసిద్ధము లయ్యును బయటికి వెల్వడ సమర్థ

ములుగాని మనోవృత్తులను బాగుగా కనిపెట్టి చక్కని సందర్భములను గల్పించి చిత్రించియున్నచో, అవి వారి మనమును తత్ క్షణమే యాకర్షించుటకు సంశయంబేమి? ఒక పుస్తకము చేపట్టినంతనే, అందు పాఠకునకు స్వానుభవములగు విషయము లనేకములు పొడగట్టుటయే గాక, తనవలెనే కష్టసుఖములకుఁ బాల్పడినవారి జీవితములను గురించిన యభిప్రాయములను వాని కది వెలిపఱచుచుండును. అట్టివాని స్థితికై సానుభూతి గనఁబఱచు ననేకులగు సాటి జను లా గ్రంథమునఁ గనఁబడుటచేతనే, వాని కొకమాదిరి యానందమును, తాపోపశమనంబును, మనశ్శాంతియుఁ గల్గుచుండును. కావుననే జార్జి ఎలియట్ అను నామె 'వాఙ్మయ మనునది మన యనుభవజ్ఞానమును వృద్ధిచేసికొనుటకును, సామాన్యముగా మనము కలిసికొనుటకు వీలులేని పలువురు సజాతీయులతోడి సంబంధము కలుగఁజేసికొనుటకును ముఖ్య మార్గ' మని చెప్పియున్నది. ఇట్లు సార్వజనీనంబులు సహజంబులు నగు జాతీయ భావములను మనోవృత్తులను ప్రతిపాదించున దగుటంజేసియే వాఙ్మయము నందు మానవకోటి కంత యభిమానమును గౌరవమును గలుగుచున్నది.

1. అర్థాదులు:- (1వ పేరా) అంతఃకరణము=మనస్సు. సంసర్గము = కూడిక, (3) నాగరికతాగరిమ = నాగరికతయందలి గొప్పఁదనము. పశు-చారణ+ఉపజీవులు = గొడ్లనుమేపుకొను పని నాధారముగాఁ జేసికొని జీవించువారు. ఉద్గాత = యజ్ఞమునందు సామవేదతంత్రమును నడుపువాఁడు. అధ్వర్యుఁడు = యజ్ఞమునందు యజుర్వేదతంత్రమును నడపువాఁడు. సంహిత = వేదమునందలి మంత్రభాగము. తత్త్వవిచారణవ్యగ్రులు=పరమార్థవిషయముల నాలోచించుటయందత్యంతాసక్తి కలవారు. (4) ఆలవాలము=పాదు, కుదురు. (5) గత+అనుగతికము=ముందుపోయిన వారి వెంటనే పోవునది. యశః+లుబ్ధులు = కీర్తియందే యాశ కలవారు.

2. ప్రశ్నలు:-

1. "కావున వీని సంబంధం బతి సన్నిహితంబని యెన్నఁదగి యున్నది." వేని సంబంధము? ఏల సన్నిహిత మని చెప్పవచ్చును?
2. రెండవ ఛార్లెసుకాలమునఁ గవితయందలి పూర్వపురుచి మాఱి కవితాప్రవాహము మాఱుత్రోవఁ బట్టుటకుఁ గారణమేమి?

3. పదునెనిమిదవ శతాబ్దమున ఫ్రాన్సు దేశమున బయలుదేరిన విప్లవమునకుఁ గారణ మేమి ?
4. 19 వ శతాబ్దమున నాంగ్లవాఙ్మయమున నవలలు విశేషముగాఁ బొడసూపుటకుఁ గారణమేమి ?
5. టెనిసన్ తన రచనల మూలమునఁ జేసిన గొప్పపని యేమి ?
6. బ్రాహ్మణులు, నారణ్యకములు నన నేవి ?
7. సూత్ర గ్రంథము లేల యేర్పడినవి? అందలి కొన్ని తెగలను దెల్పునది.
8. బౌద్ధమతము జనసామాన్యము నెట్లాకర్షించెను ?
9. "ఈ యుగ మాంధ్రవాఙ్మయమున భాషాంతరీకరణయుగమై వెలుఁగొందినది." ఏ యుగము ? ఏల భాషాంతరీకరణ యుగ మయ్యెను ?
10. శ్రీనాథుఁ డొనరించిన వాఙ్మయసేవ యెట్టిది ?
11. పెద్దనార్యుఁడు ప్రబంధ రచన కెట్టి దారి చూపెను ?
12 ఆంధ్రకవిత జనసామాన్యపు స్థితినిఁ దెలుపలేకుండుట కేమి కారణము ?
13. 'జార్జివిలియట్' అను నామె వాఙ్మయమును గూర్చి యొసఁగిన యభిప్రాయ మేమి ?

3. రచన:– (1) సంస్కృత వాఙ్మయ మే యే పరిస్థితులం దెట్టి వికాసము నొందినదో వ్రాయునది– లేక – హైందవ వాఙ్మయము ప్రాచీనార్యుల జాతీయ జీవన పద్ధతి నెటుల విశదము చేయుచున్నదో వివరించునది. (2) ఆంగ్లవాఙ్మయమున నాంగ్లేయుల సాంఘిక జీవన మెటుల ప్రతిబింబించినదో వివరించునది.

4. వ్యాకరణాంశములు:– ఈ క్రింది పదములను గలిపి, యేర్పడు రూపముల నన్నిటినిఁ బరిశీలించునది–

ఇందులకున్ + తార్కాణము.
కవితారుచికిన్ + తగిన.
వర్ణింపన్ + చొచ్చిరి
మాటుత్రోవన్ + పట్టినది.
అధ్వర్యులకున్ + విధింపఁబడిన.
అంతయున్ + సూత్రములలో.
గ్రంథములవలనన్ + ఆ కాలపు స్థితిగతులు.
ఈదారినే + పోయిరి.

# 3. సఫలత

## పండిత, వడ్లమూడి వేంకటరత్నముగారు

ఈ గద్యభాగము శ్రీ॥ శ్రీ॥ వేంకటరత్నము చౌదరిగారిచే రచియింపఁబడిన "సఫలత" యను గ్రంథములోనిది. ఈ గ్రంథమందు మానవుఁ డెట్టి సదభ్యాసముల నలవరచుకొని యాదర్శజీవి కావలయునో, కార్యశూరుఁడై యెటుల మెలఁగవలయునో, పురుషార్థముల నెటుల సాధింపవలయునో చక్కఁగా నిరూపింపఁబడినది.

వేంకటరత్నముగారు పెద్దకాలము గుంటూరు మండలమందలి యున్నత పాఠశాలలం దాంధ్రాధ్యాపకులుగ నుండిరి. తుదకుఁ దెనాలి కళాశాలయం దాచార్యత్వము నెఱపుచుఁ గాలధర్మ మొందిరి. వీరు సరస హృదయులు; వీరి ప్రతిభ ప్రాచీన సంప్రదాయముల విడువని యభినవత్వముతో నొప్పారుచుండును.

1. సాఫల్యప్రాప్తికి ఆలోచనాపూర్వకమగు ప్రయత్న మత్యంతావశ్యక మనుట యచంచల సిద్ధాంతము. ఒకప్పు డొకరు నెపోలియనును 'మీ సఫలతకుఁ గారణమేమి?' అని యడుగఁగా నతఁడు 'ప్రతికార్యమునందును నిరంతరము లగ్నమై యుండుటయే నా సఫలతకు మూలమంత్రము' అని బదులిడెను. ఈ విషయమున బెంజిమన్ ఫ్రాంక్లిను అభిప్రాయ మింతకంటె విశదముగా నుండును. 'కార్యములు కోరికలవలనఁగాక పరిశ్రమల వలన నెఱవేఱుచుండును. ఆశమీఁద జీవించువాఁ డాఁకలిచేఁ జావవలసినవాఁడే యగును, ప్రయాసము లేకుండ ఫలము లభింపఁబోదు. వ్యాపారము చేయువాఁడు 'జమీ' నార్జింపఁ గలడు. వృత్తి నొనర్చుకొనువాఁ డాదాయ ప్రతిష్ఠలతోఁ దులదూఁగుచుండును. పనిలోమాత్రము సంపూర్ణముగఁ దన్మయత నొందవలయును. కష్టపడువారు కడుపుచిచ్చుతోఁ గాలవలయు నవసరము లేదు...'

2. "పరిశ్రమవలనఁ దన ఋణము తఱఁగి పోవుచుండును. తనకు పైతృకమగు సంపద లేనంతమాత్రమున లోటులేదు. పరిశ్రమయే సౌభాగ్యమును బ్రసవించును. కష్టశీలున కీశ్వరుఁ డన్నియుఁ గరుణించును........కావున నేఁడే నడుము గట్టుము. ఱేపు నీ మార్గ

మున కేమి యాటంకములు దటస్థించునో తెలియదు. అంతియకాదు. ఒక్క 'నేడు' రెండు 'రేపు' లకుఁ దుల్యము. నేటిపని రేపటికి కెప్పుడును నిలిపియుంపకుము. ఈ స్థితిలోనే నీవు నీ కొఱకుఁగాని – నీ కుటుంబము కొఱకుఁగాని – నీ సంఘముకొఱకుఁగాని – నీ దేశము కొఱకుఁగాని యేమైనఁ జేయఁగలవు. చేతులు ముడుచుకొని యూరక యెన్నడుఁ గూరుచుండకుము. నీ బాధ్యత మిక్కుటము. తత్సాధనములకే నీ యాయువును బోఁగొట్టుకొనకుము. చిటవగు పూనికతోఁ గార్యమును బూనుము. అప్పుడు చూడుము. ఎట్టిపరిణామమగునో! త్రాడు నిరంతర మొఱయుచుండుటచేతనేగాదా ఱాయి యరగిపోవుచుండును! ఎడ తెగని ప్రయత్నముచేత కీటకములు సయితము ఱాతిలో నివాస మేర్పఱచుకొనుచుండఁగా గాలుసేతులు, బుద్ధిచాకచక్యముగల నీవు నీ కార్యమును సాధింపఁజాలవనుట సిగ్గుచేటుగాదా!"

3. ఏ దేవుఁడో – దయ్యమో, మాయయో – మంత్రమో, పరిశ్రమ చేయకయే వచ్చి ఫలము నిచ్చు ననుకొనుట ప్రమాదము. భవానీమాత యెంత యనుగ్రహపాత్రు డైనను శివాజీ మహారాజు కత్తి పట్టక సిద్ధినిఁ బొందలేదు. భగవత్కరుణా భాజనమయ్యు గురు గోవిందసింహుఁడు జతనము చేయకుండ సఫలుఁడు కాలేదు శ్రీమహా విష్ణు నవతారమగు శ్రీరామచంద్రుఁడు సయితము సంకల్పమాత్ర మున జానకీదేవిని గైకొనలేదు. ఆహారమును దీసికొని భుజియింపకున్న నెవ్వానికేని కడుపు నిండునా? నూవులయం దెంత నూనె యున్నను వానిం గైకొని గానుగాడకున్నచో నూనె లభియింపఁ గలదా? గనుల యం దెంత కనక మున్నను త్రవ్వి బయటికిఁ దీయకున్న దరిఁజేరునా? ధనికులలో పండితుఁడగు బాల గంగాధర తిలకును గాని మఱి యెవ్వ రినిగాని వారి సఫలతలకుఁ గారణముల నడిగినచో శబ్దములు భిన్న ములుగా నుండవచ్చును గాని యభిప్రాయము మాత్ర మెల్లరఁ దొక్కటిగనే యుండును. సఫలతాదేవి మందిరమున కనాయాసముగఁ జేరఁదగు 'చట్కా' యేమియు లేదు. అది బదరికాశ్రమ మార్గము వోలె విషమము – దుర్గమముగ – నుండును. ఇచటనే యాత్రికుల ధైర్య

సాహసములు పరీక్షింపఁబడుచుండును. కష్టములకోర్చి యాస్థానముఁ జేరిన వారికి వరఫలములకుఁ గొదువ యుండదు. ఒకమారొకఁడు మఱియొకనితో "నేనుగూడ నీ వలె భాగ్యవంతుఁడను కాఁగోరు చున్నాఁడను" అనఁగా నతఁడు 'ఆఁ! అవును. నిరంతరధైర్యపూర్వక పరిశ్రమము వలన నని నీయుద్దేశము!' అని యుత్తర మొసఁగెను.

4. ఇట్టి కష్ట సహనమునకు – నిరంతర ప్రయత్నమునకు ఉజ్జ్వలోదాహరణము 'బర్నార్డు పాలసీ' జీవనము. ఇతఁడు పదునాఱవ శతాబ్ది ప్రారంభమున ఫ్రాన్సు దక్షిణభాగమున జనన మొందెను. ఇతఁడు తన జనకుఁడు చేయుచుండు అద్దపు పని నేర్చుకొనెను. నిఱు పేద కుటుంబమున జన్మించి యుండుటచే బాల్యమున నితనికిఁ జదువు కొను భాగ్యము లేకపోయినది. తఱువాత నొకసూాఁడతఁడు చెప్పెను. 'ఎల్లరుఁ జదువుకొనుట కనుకూలముగఁ దెఱచియున్న భూమ్యాకాశ ములే నాకున్న పుస్తకములు' అని. కాని పిమ్మట అద్దములపై బొమ్మలు చిత్రించుటయుఁ జదువుటయు వ్రాయుటయు నేర్చుకొనెను.

5. ఇతనికి పదునెన్మిదేండ్ల వయసు వచ్చునప్పటికి అద్దపు వ్యాపారము క్షీణించిపోవుటచే మూటముల్లె గట్టుకొని యనుకూలావ కాశము నన్వేషించుచుఁ బయన మొనర్పసాగెను; ఈ కాలములో నచ్చటచ్చట దొరకిన పనులఁ జేయుచు తీరికయైనప్పుడు భూమికొలత నేర్చుకొనుచుండెను.

6. పది వర్షము లిట్లు తిరిగి తిరిగి, ఒక కన్నియను వివాహ మాడి, సంచారముమాని స్థిరనివాస మేర్పఱచుకొనెను. అద్దములపైఁ జిత్రించుచు – భూమిని కొలచుచుఁ గాలము పుచ్చుచుండెను. క్రమ ముగా నతనికి సంతతి పెరిగెను. దానితో వ్యయముఁ బెరిగెను. ఆదాయము చాలుటలేదు. ముందైనను ఆ వృత్తులవలన నధికాదా యము వచ్చునను ఆశయు సున్నయే. అందువలన ఒక నూత్నవృత్తి నవలంబింపవలసివచ్చెను. కనుక మంటిపాత్రలపైఁ జిత్రములు చిత్రించు టయు, వానికిఁ బైన బూఁత పూయుటయు మేలుగాఁదోఁచెను. కాని యాపని బొత్తిగఁ దెలియదు. కుండలు కాల్చుటయు నతఁడావఱకుఁ

జూచి యెఱుఁగఁడు, తనకుఁ దానే నేర్చుకొనవలసి వచ్చెను. బోధకులుగాని సహాయకులుగాని యెవ్వరును లేరు. అయినను సఫలతయం దతనికి విశ్వాసము మెండు. నేర్చుకొను నభిలాష యసామాన్యము. ధైర్యసంతోషము లనంతములు.

7. ఇటలీలోఁ జేయఁబడిన యొక చక్కని పింగాణిగిన్నె యతని కంటఁబడెను. ఆ నూత్న కళాభ్యాసమునకు వేడుక వొడమెను. ఆ గిన్నెనే యొక సామాన్యుఁడు చూచియున్న నేభావమును గలిగెడిది గాదు తక్కినసమయములం దతనికైన నేయుద్దేశముగలిగియుండెడిదో కాని లాభకరమగు వృత్తినన్వేషించుచుండుటచే అట్టి పాత్రలు చేయఁదలంపుగలిగెను. హృదయము ఊకెత్తెను. తోడనే ఆ పాత్రపై నున్న పూఁతను దెలియ నుద్దేశించెను. ఆతఁడాలుబిడ్డల సంకెలలేనిచో ఇటలీదేశమునకైన నేగి యా విషయము దెలిసికొని యుండెడివాఁడే; కాని, యిప్పుడెట్లు ? దారాపుత్రులను దీసికొని వెళ్ళుటకును అనుకూలము గాక పోవుటచేఁ బయనముమాట విడచి అచటనే యుండి మంటిపాత్రలు చేయుటయు, పైన పూఁత పూయుటయు నెఱుఁగఁ ద్రిప్పలు పడసాగెను.

8. మొదట నతఁ డా పూత యేయే వస్తువులచేఁ జేయఁబడినదో యూహించి తెలిసికొనఁ దలంచెను. పలువిధములగు పరీక్ష లారంభించెను. అట్టి పూతఁ గాఁదగిన వస్తువులం దెచ్చి యొక చూర్ణము సిద్ధమొనర్చెను. ఒక మంటిపాత్ర గొనితెచ్చి బ్రద్దలుగొట్టి యాచూర్ణము పూసెను. ఒక ప్రొయ్యి నేర్పరచి యా పెంకులం గాల్చెను. కాని యా పరీక్షలు నిష్ఫలములయ్యెను. పాత్ర-కట్టెలు-పొడి-కాలము-కష్టము అన్నియు వ్యర్థమగుట దక్క మఱి యేలాభము లేకపోయెను. ఇట్టి పరీక్షలన్న సామాన్యముగ స్త్రీలకు తలకంటగింపు పిల్లల కూఁడు గుడ్డల కక్కఱకువచ్చెడి రొక్కము పాడుచేయుట యని వారి తలంపు. పాలసీ సతియు నింతియే. ఆమె పతియానతి యెంత భక్తితో పాలించుచున్నను బాత్రలు కొని యిట్లు బ్రద్దలుకొట్టుటకిష్టపడలేదు. ముక్కలు

చేయుటకే తెచ్చుచున్నట్లామె భావించుచుండెను. కాని తన భర్త దృఢసంకల్పుఁడైనందున తన కంగీరింపక తప్పదయ్యెను.

**9.** పాలసీ మాసములు - వర్షములు నిట్లు పరీక్షలుచేయుచునే యుండెను. మొదటి ప్రొయ్యి వలన పని సాగక పోవుటచే ఇంటికి వెలుపల నొక కొలిమి యేర్పఱచెను. అతఁ డెన్నియో కుండల కొండలు-కట్టెల గుట్టలు - పొడుల రాసులు దానికి బలి యొనర్చెను. కాలము పాడుచేసెను. ఇందువలన కుటుంబమునకుఁ బేదతన మాదరు వయ్యెను. పిమ్మట అతఁ డొక మాటిట్లు చెప్పెను. 'ఇట్లు నేను పెక్కుసంవత్సరము లిక్కట్టులతోఁ గడిపితిని. నా ప్రయత్నమున నేమియు నూత్న ఫలము గానరాలేదు.'

**10.** అతఁ డప్పుడు తన పరిచితవృత్తు లొనర్చుచు వచ్చుచుండెను. కాని, ఆదాయము సన్నగిల్లెను. కావున నింధనములకును ధనము లేకపోవుటచేఁ దన కొలిమిలో నీ ప్రయోగములు చేయఁజాలక పోయెను. అయినను కొన్ని పాత్రలు కొని మూఁడు నాలుగు నూఱుల ముక్కలు చేసి కలకొలఁది కూర్చినపొడి నలఁది వానిని దగ్ధము చేయుటకు నాలుగైదు మైళ్ళదూరమున నున్న యొక పెంకుల యావమునొద్ద కేగెను. తన పెంకులు బాగుగఁ గాలిన వెనుక సంరంభముతో వెలికిఁ దీసి పరికించెను. ఫలము యథాపూర్వమే చిత్తమున విచారము దోఁచెను. కాని వెనుకాడుట యతఁ డెఱుఁగనిది. మరల నచటనే ప్రయోగము చేయ నిశ్చయించుకొనెను.

**11.** భూమిని గొలుచుట కతఁడు సరకారులచే నిర్బంధపఱుపఁబడుటచే తన ప్రయత్నములకు కొంతకాలము విశ్రాంతి యీయవలసి వచ్చెను. కాని యా కార్యమువలనఁ బైకము కొంత చేకూరెను. ద్విగుణీకృతోత్సాహముతోఁ దన ప్రయత్నమునకు మరల నడుముకట్టెను. ముప్పదియాఱు మృణ్మయపాత్రలు కొని ముక్కలు చేసి పెక్కు రకముల చూర్ణములు అందుంచి వానిని కరగించుట కద్దములు, గాజులు కాల్చుచున్న ఒక చేరువ యావము నొద్దకుఁబోయెను. ఈ మా ఱతని

యాశాలత కొంచెము చిగిరించినది. ఆ యద్దపు టావపు తీక్ష్ణాగ్ని కా పూఁత కరఁగినది. కాని తెల్లఁదన మింకను గలుగలేదు.

12. ఇట్లు రెండేడులదాఁక ప్రయోగములు చేయుచునుండెను; కాని సంతోషకర పరిణామము కలవద్యేను. ఇంతలో చేతిపైక మెల్లఁ జెల్లిపోయెను. అయినను సాహసించి మఱి యొక్కమాఱు ప్రయత్నింపఁ దలపెట్టెను. ఇంచుమించు నన్నూఱు పెంకులను దాపునఁగల యద్దపు టావమునఁ బెట్టి ఫలాతురతతో నెదురుగఁ గూరుచుండి యాశాలతకుఁ బ్రాకులు వెట్టుచుఁ బదిగడియలు బ్రతీక్షించెను. అందొక్క పాత్రయందలి చూర్ణము కరఁగెను. అది శైత్యయోగమున గట్టిపడెను. తెల్లతెల్లని కాంతులతో నిద్దముగ నద్దమువోలె తోఁచి యత్యంతానందదాయకముగ నుండెను. ఇంతటి కష్టములననుభవించిన వెన్క నది సుందరముగా నెందుల కుండదు? అతఁ డద్దానిని దన కాంతామణికిఁ జూపఁగోరి పేరెమువాఱి 'నేనొక క్రొత్త మనుజుఁడ నైనట్లున్నది' అని తొందరతోఁ జెప్పివైచెను? కాని యతఁ డింకను సఫల మనోరథుఁడు గాలేదు. సాఫల్యము చాల దూరముననే యుండెను. అంతిమ మని తలఁచిన యీ ప్రయోగమున కొంత యాశ గలుగుటచే నతఁడు మరల ప్రయత్నములు చేసెను కాని అన్నియు వ్యర్థములే.

13. అయినను దన ప్రయత్నము నెఱవేఱునని యతనికి విశ్వాసము గలిగెను. కాన తత్ప్రాప్తికై తన గృహసమీపమున గుప్తముగ నొక యావమును నిర్మింపఁ దలపెట్టి స్వయంకృషికిఁ బ్రారంభించెను. ఇటికలు తన మూఁపుపై మోసి తెచ్చెను. వానిని జెక్కుటయుఁ, గట్టుటయు నన్నియు నతఁడే. తన్నిర్మాణమున కిట్లెనిమిది మాసములు గడచెను. చివర కావము పూర్తియైనది ఈ కాలముననే తన ప్రయోగమునకుఁ బెక్కు పాత్రములను జేసి యుంచెను. వానిలోఁ గొన్నిటి నొక్కమాఱు కాల్చి పూఁతవైచి బట్టీలోఁ బెట్టెను. అతని యొద్ద నొక్కము తక్కువగా నున్నను దన యీ యంతిమ ప్రయత్నమునకుఁ గట్టెలు గుట్టలు గుట్టలుగాఁ జేర్చి యుంచెను. వీని వలనఁ దన యభీష్టము సమకూఱునని యతని యూహ. అతఁడు బట్టీ వెలిగించి

పగలంతయు దాని కెదురుగఁ గూరుచుండి కట్టెలు జొనుపుచుండెను. రాత్రి యంతయు నట్లే కూరుచుండి తెప్ప వేయక చూచుచుండెను. కాని యా పూఁత కరఁగ లేదు. ఇంతలో సూర్యోదయ మయినది. రెండవ పగలు ముగియ వచ్చెను. అతఁ డచటనుండి కదలక పోవుటచే నతని భార్య యాహారము దెచ్చి పెట్టెను. అతఁడు సెగ పెట్టుచునే యుండెను. పగలు తొలఁగిపోయెను. రేయి కడచనెను అయినను ఫలము కలుగలేదు. పాలసీ వివర్ణుఁ డాయెను. కాని పూఁతవర్ణము పరివర్తన మొందలేదు. అయినను నతఁడు విసుఁగు పొందలేదు. బట్టి కెదురుగ నుపవిష్టుఁడై పరికించుచునే యుండెను. మూఁడవ దినము రాత్రియు నటులనే యేతెంచినవి; మఱుఁగువడినవి. ఊఁహూ! పూఁత కరఁగలేదు. అట్లే నాల్గవ నాఁడుతొలఁగిపోయినది. ఏనవదినము పైనము చేసినది. ఆఱవరోజు జాఱిపోయినది. ఇట్లాఱు రేపవ ళ్ళసమసాహసి యగు పాలసీ చూచుచుండఁగనే - శ్రమ పడుచుండఁగనే - నిద్రాహారము లెఱుఁగక కృశియించు చుండఁగనే మాయమైనవి. అయిన నా పూఁత కరఁగనే లేదు.

**14.** ఆ పూఁతకొఱ కుపయోగించిన వస్తువులలో నేదో లోప ముండియుండునని నిశ్చయించి మరలదినుసులఁ గలిపి మఱియొక మాఱు పరిశీలనము చేయ నిశ్చయించెను ఇట్లు రెండు మూఁడు వారములు గడచినవి. కాని యతనికి పాత్ర లెక్కుడివి; తాను జేసికొన్న పాత్రలు నిరంతరము కాలుచుండుటచే నిరుపయోగము లయ్యెను. తన చేతి సొమ్ము వట్టిపోయెను. అయినను అప్పుమాత్రము పుట్టింపఁగలఁడు. తన విశ్వాసము నతఁడు ధ్వంసము చేసికొనలేదు. మిక్కుటముగ మంటి పాత్రలకు వంటచెరుకునకు వలయుపైకము నప్పు దెచ్చి యింకొక పరి ప్రయత్నించెను. మరలక్రొత్తచూర్ణము మెత్తి బట్టిలోఁబెట్టి మంట రగుల్కొల్పసాగెను.

**15.** మంటలు నాల్క లార్చుచు మింటి కెగయుచుండెను. మ్రొడులు బూడిదయగుచుండెను. కాని కార్యసిద్ధిమాత్రము కాన నగుటలేదు. ఇంతలోఁ గొయ్యలు చెల్లిపోయినవి. ఇక నగ్ని దేవున

కాహుతి యేది ? తోఁటకు చుట్టును కంచె యున్నది. ఇటు ప్రపంచ మటు మాఱినీ ! పరీక్షాకార్యమునకు మాత్రము భంగము రారాదు. అవియును వచ్చి యాహుతి యయినవి. కాని పూఁత మాత్రము సడల లేదు. మఱి పదినిమేషము లా సెగ యున్నచో ఫలము కలుగవచ్చును. తన సర్వస్వము పోయిన పోనీ ! ప్రొయ్యి మండవలసినదే ! ఇఁక నింటిలో కొయ్యసామాగ్రి — అలమారులు—ఉన్నవి. ఇంట ఫెళఫెళా రావములు వినవయ్యెను పాలసీకి వెఱ్ఱియెత్తినదని తలంచుచున్న ఆలు బిడ్డ లలబలము చేయఁదొడఁగిరి. మేజాలు బూది యయ్యెను. కాని పూఁత మాత్రము కరఁగలేదు. మరల నలమారులు గలగలలతో నగ్నియందైక్య మొందుచుండెను. ఇంటిలోనివారు వీధిని పడి కేకలు పెట్టుచుండిరి.

16. పాలసీ నెలదినములనుండి యొడలి చొక్కాయును మార్ప లేదు కడుపునిండ కూడును కంటికి నిద్రయు నెఱుఁగఁడు. చిక్కిశల్య మాయెను. నిరీక్షణము, విచారము నతనిని మెసవుచుండెను. కాని ఏమైననేమి? తుదకతఁడు తన ప్రయత్నమును సాధించినాఁడు. ఆ నిరం తర ప్రచండాగ్ని కాపూఁత కరఁగినది. అతని పూనిక నెఱవేఱినది. అతని కష్టము గట్టెక్కినది. ఆతని యాశాలత ఫలించినది. అతఁడు పొందిన కష్టము లనంతములు. ఇంటను — పరిసరములను నిందలకు లెక్కలేదు. అయినను దన ప్రయత్నమునకు స్వస్తిచెప్పలేదు.

**17.** ఇట్లాతఁ డా పూఁతను గనుగొనుటకు పదియేఁడులును, దదున్నతికి మఱి యా రేడు సంవత్సరములును, ఎన్నియో యిక్కట్టు లతో — ఎంతయో యోరిమితో — ఎన్నియో ప్రయోగములు చేసి ఫలము సంపాదించి 'సఫలత ప్రయత్నాధీనమే' యని చాటి తన కీర్తి చంద్రికలను చిరంజీవులు చేసినాఁడు.

**1.** అర్థాదులు:– (1 పేరా) అచంచల సిద్ధాంతము = మార్పు నొందని నిర్ణయము (3) పండితుఁడు (వ్యు) జ్ఞానము కలవాఁడు (విద్వాంసుఁడు) శబ్దము (నా. నా) పదము, ధ్వని. (4) చటాకి = సులభముగు నోషధి. (11) ద్విగుణీ కృత + ఉత్సాహము = రెండురెట్లు గాఁ జేయఁబడినయుత్సాహము. మృత్ + మయ-

పాత్రలు = మట్టితో జేయఁబడిన పిడతలు, కుండలు మున్నగునవి. (12 నిద్దము(ప్ర) స్నిగ్ధము పేరెమువాటి = దాడుతీసి. (13) గుప్తముగ = రహస్యముగ. ఫలకము(వి) పలక. అసమ సాహసి = సాటిలేని తెంపుకలవాఁడు.

## 2. ప్రశ్నలు :–

1. నెపోలియను సఫలతకుఁ గారణమేమి ?
2. "కష్టపడువారు కడుపుచిచ్చుతోఁ గాలవలయు నవసరము లేదు." ఇది యెవరి సిద్ధాంతము ? దానిని వివరించునది.
3. "ఒక్క నేఁడు రెండు రేపులకుఁ దుల్యము" దీని భావమును వివరించి, యీ మాటల నెవరు పలికిరో తెలుపునది.
4. మానవ యత్నము లేనిదే ఫలితము చేకూర దనుటకుఁ గొన్ని దృష్టాంతములను జూపునది.
5. బర్నార్డు పాలసీ యే దేశమువాఁడు ? అతఁడు నేర్చిన విద్య లేవి ?
6. అవమును దయారు చేసికొనుటకుఁ బాలసీ యెటుల శ్రమచేసెను ?
7. పాలసీ పింగాణి పూఁతను గనుగొనుటకై కావించిన తుది ప్రయత్నమును వివరించునది.
8. పాలసీ యింటిలోనివా రాతనికిఁ బిచ్చియెత్తినదని తలచుట కేమి కారణము?
9. పాలసీ జీవితము నుండి నేర్వఁదగిన నీతి యేమి?

**3. రచన:–** (1) పాలసీ జీవితము నాతని మాటలలో వ్రాయునది.

(2) కార్యదీక్షను గూర్చి యొక్క వ్యాసము వ్రాయునది.

(3) క్రింది పదములను జేర్చి వాక్యరచన కావించునది.

తలకంటగింపు - సన్నగిల్లెను - నడుము గట్టెను - పేరెమువాటెను.

**4. వ్యాకరణాంశములు:–** ఈ క్రిందివానిలోని యరసున్నలలో సిద్ధము లేవో సాధ్యము లేవో పరిశీలించునది:–

వాఁడు - ఆర్జింపఁగలఁడు - నేఁడుపోఁగొట్టుకొనెను. శ్రీరామచంద్రుఁడు - పూఁత - ఎఱుఁగక - కరఁగి - దాఁక - తొలఁగి.

---

# ౪. ముని వచనము

## కావ్యతీర్థ గట్టి లక్ష్మీనరసింహ శాస్త్రిగారు

## శ్రీ జి. వి. కృష్ణరావుగారు, బి. ఏ.

ఈ భాగము కళాపూర్ణోదయ మను గద్యకావ్యములోనిది. పింగళి సూరనార్యుని కృతియగు కళాపూర్ణోదయ ప్రబంధమున కిది గద్యబంధము. ఈ కావ్యకర్త లిరువురును తెనాలి పురవాసులు; సారస్వతసేవారతులు. ఈ కవివరు లిద్దఱును వేఱు వేఱుగఁ గూడఁ బెక్కు కావ్యములను నిర్మించిరి. నరసింహశాస్త్రిగారు శిశుపాలవధ, అచ్యుతరాయాభ్యుదయము మున్నగు ప్రబంధములను, నాటకములను రచియించిరి. కృష్ణరావుగారి జేగంటలు, చైత్రరథము, కీలుబొమ్మలు మున్నగునవి ప్రసిద్ధములు. వీరి రచన లన్నిటియందును వివేచనాదృష్టి వ్యక్తమగుచుండును.

కళాపూర్ణోదయ మందలి కథాసంవిధాన మద్భుతావహము. దానికి వన్నెలు దిద్దిన దీ వచనరచన. అందుఁ బ్రకృతభాగమునకుఁ బూర్వవృత్తమిది — కలభాషిణి ద్వారకాపురమందలి వేశ్యారత్నము. ఆమె మనసు కుబేరనందనుఁడగు నలకూబరునిపై లగ్నమయ్యెను. కాని నలకూబరుఁడు రంభామనోహరుఁడు. ఒకమాఱు మణిస్తంభుఁడను సిద్ధుఁడు సింహవాహన మెక్కి కలభాషిణియున్న యుద్యానమునకు వచ్చెను. అతనికి దూరదర్శన, దూరశ్రవణశక్తులు గలవు. అతఁడా శక్తుల నామెకుఁ జూపెను ఆమె సంగీతము నాలకించి తానానందించెను. అతఁడు ప్రసంగవశమున మణికంధరుని తపము చెఱుప, రంభ యనంతశయన క్షేత్రమున కరిగెననియు, నలకూబరుఁడా ప్రాంతముల నొంటరిగా నున్నాఁడనియుఁ జెప్పెను విన నన్నాతని కడకుఁ జేర్పుఁడని కలభాషిణి యాతని వేఁడుకొనియెను. — తరువాతి వృత్తాంతము పఠనీయము.

1. అది విని సిద్ధుఁ 'డబలా! నీవేడ? ద్వారక యేడ? అతఁడేడ? అనంతపద్మనాభభూభాగమేడ? నే నిన్నచటికిం జేర్చుటెట్లు? పయనము మన కలవియే? ఆతని సన్నిధి కరుగవలెనన్న మా గురువులు శిక్షించిన యీ సింగపు వాహనమున కొక నాల్గుగడియల సంచారము కావలయు. ఏమైన నేమి? దీనిపైనెక్కించుకొని నే నినుఁ దీసికొని పోదునందునా; తోడి సిద్ధు లిది వేళాకోళముగా నెంతు రంతియగాక, మీబోంట్ల సంస్పర్శమాత్రంబును నస్మదాదులకు సమ్మతింప సముచితంబుగాదు. విన నుపచారాదులవలన నీవు నాదాన వగుటను నీ వేఁడికోలునకు నియ్యకొని రహస్యముగ నట్లేకొనిపోయి యాతనిఁ జేర్తు

ర' మ్మని యాపె నయ్యోనికదిండి వార్వమ్ముపైఁ దన పిఱుఁద నెక్కించుకొని ధేయని కదలించి యాకసపుదారింబట్టి, పలుమాఱుఁ గలభాషిణిం దేఱి కనుఁగొని పదిలము సుమ్మనుచు నతి త్వరితగతిఁ బయనమ్ము సాగించె.

2. అట్టు లెన్నిరో కొన్ని యామడల దవ్వరిగి యొక్కచో నా సింగపువారువము మొగమెత్తి యఱచుచు నొక యడుగైనను ముంగల నిడి పాఱక కాడిం బాఱవైచె. సిద్ధుఁడు నెన్నియో ప్రయత్నంబులు సేసి కదలింపనేరక తుదకేదియో స్మరించి నేల కొఱిగి పడనున్న కలభాషిణిం బల్లవు మఁగో మ్మేమఱకు మని పదిలమ్ము సెప్పుచుం దనపారీంద్రమ్మును గొన్ని యడుగులు దిరుగఁబట్టి ధరణికి డిగఁదోలుకొని వచ్చి యచట నచ్చెలువతో నవరోహణంబు సేసి యా కేసరిని మేఁతకు విడిచిపుచ్చి కలభాషిణితో నిట్లనియె:

3. “సుందరీ ! యీ ముందఱి నికటవనమ్మునంద మృగేంద్రవాహన యను నొక మహాశక్తి గలదు. తన్మందిరంబున నొక మృగేంద్రంబును గలదు. అద్దానికిఁ గ్రిందు మీఁదం జుట్టుపట్టుల నెట్టి బెట్టిదంపు సింగంబులును జనవెఱుచు. ఇది మించి యే నెంత తోలిన మన వాహనం బచటి కట్టెదురు నడదు మన మమ్మహాశక్తి కభివాదనంబు సేసి పోయినంగాని కార్యంబు నెఱవేఱ నేరదు. అట్లు సేసి వత్తము రమ్ము.”— అని యతఁ డట్లన తన భల్లూకచర్మకోశంబు తోడి ఖడ్గంబు పుచ్చుకొని సింగపుఁ బల్లవము పోక యక్కడన మొక్క మఱుఁగున డాఁచి, యా చపలలోచనను మృగేంద్ర వాహన గుడికిం దోడ్కొని చని వెలుపలి మంటపంబున నునిచి, యద్దేవి పూజకుఁ బువ్వులు దెచ్చెద. నే వచ్చుదనక నిచ్చటనే యుండునది’ యని పూఁదోట కరిగె.

4. అత్తఱి నొక జరత్తపస్విని కలభాషిణిం దఱియ నరుదెంచి, ‘బిడ్డా! నీ వెందుల దానవు? ఇచ్చటి కేల వచ్చితివి? బాపుర పిల్లి బారిం జిలుకవోలె సిద్ధాపదేశంబుననున్న యి ద్దురాత్ముని పాలిం బడితివో? అక్కటా! వింత చెలువమున నివ్వనము నెల్ల నలంక

రించుచుఁ గన్నుల పండువుసేయు నీ మేని పస నల్లంతనచూచి కన్ను గుట్టి దైవమిట్టి పట్టి కఱకు కిరాతుని బారిం బడవైచెనే? నుదుటివ్రాలు! ఏమనఁగలము? బిడ్డా ఆ కలుషాత్మకుఁడు రాకమున్నే నీ వెందేనిం దప్పించుకొని చని యీ మనోహరాకృతి కఱకుఁ గత్తిపాలుగాకుండఁ గాపాడుకొనుము. అటుగాదో, నేనా భయంకర దృశ్యమును జూడఁ జాల. ఈతఁడు నీకుఁ గావలసినవాఁడే యవుంగాక; ఎచ్చోటికేని నీ పనియ కొని నినుఁ గొనిపోవుచుండుఁగాక, అది పొసఁగదు. ఈ దేవీ మందిరమున బలివెట్టి తన యభీష్టంబు సాధించుకొను. ఇటు లెందఱినో మున్ను తన పొట్టనఁ బెట్టుకొనినాఁడు. నిజ''మని పలికె.

**5.** ఆ పలుకు లాలించి గుండె గుభిల్లుమన నప్పల్లవాధరి వడ వడ వడంకుచు నింకఁ దా నా శక్తికి బలియగుట నిస్సంశయ మని యెంతయుఁ వగఁ జింతించి, మణిస్తంభుఁడు తన్నుఁ దొల్దొల్త గృహారామమునఁ గాంచుటాదిగ నంతదనుక జరిగిన కథయంతయు నా యవ్వకు వినిపించి, ప్రసంగవశమునఁ దన పేరు, కులము, విద్యయు, నప్పటి కోరికయును జెప్పి, 'యీ కోర్కి సాధించు తలపున, నవ్వాని దూరదృష్టి దూరశ్రవణంబుల వలన భ్రమసి యింత దవ్వరుదెంచితి. తల్లీ! వడగల్లునకుఁ బోవఁ బిడుగల్లు పడియె నెటు వోదు? నేమి సేయుదు? నాతఁడు తెలియ కూరకుండునే? మోసపోతి" నని వాపోయె.

6. అమ్ముదుసలియు నెమ్మదిఁ గఱఁగి యమ్మెఱుఁగుఁబోడికనె: 'ముగుదా! నీ వనినది నిక్కువము. ఏకటు లాసచూపి యీ పాపి నిను వంచనమెయి నిటు గొనివచ్చినాఁడు. ఇంక దన యభీష్టంబు నెఱవేర్చుకొనఁగలఁడు. ఇంతకు నిక్కుటిలుఁడు మనుష్య యత్నమునఁ దక్కఁడు. దూరదృష్టి దూరశ్రవణాదులు సాధించియున్నవాఁడుగదా! 'ఇన్ని పాట్లుపడి కన్న యీ విచిత్రమహిమకుఁ దగు రాజ్యసంపదలుఁ గొననేర్చిన నెంత యింపగునో గదా'' యని బలుమాఱితఁ డేను వినఁగ నని ముచ్చటపడుచుండు. అది నా కెఱుక. ఆ కోరిక సాధించుకొనుటకై లోకోత్తర గానకళాప్రవీణయు, లోకోత్తరరమ్యాకృతియు నగు వారవనితారత్న మెచట లభించునా యని వేయుఁ గన్నుల వెదకు

చున్నవాఁడు. అది నేఁడు నీవలన సమకూరె. అంతియగాక ఆ కలుషాత్మకుం డిచట దూరదృష్టియు దూరశ్రవణంబును సాధించె. తత్సాధన కీ కఱకు పిపాసి యెందఱెందఱి కుత్తుకలు తన కఱకుఁగత్తిం దఱిఁగి చెఱిచెనో? కొంతవఱ కేనెఱుంగుదు. బిడ్డా! గోరుగల్లు గోని తన కన్ను లూడఁ బెఱికికొనియు, ఘోరపునారసముఁ జెవులఁ బఱిపికొనియు నిద్దురాత్ముం డా రెండు విద్యలు సాధించె."

**7.** అని ముదుసలి తన్మందిరంబుముంగల మృగేంద్రవాహనంబు దండ నేకాక్షరపంక్తి చిహ్నిత శిలాస్తంభంబున వ్రేలఁగట్టిన యాశస్త్ర యుగ్మంబును, నప్పుట గంధ పుష్పాద్యర్చితంబులై యున్న యొక్క సురియయు, గండకత్తెరయు, దగ్గఱం దోడ్కొనిపోయి చూపి, నీ కీ లిపి తెలియునేనిఁ జదువు మనఁ గలభాషిణి యందున్న యర్థ మిటులని చదివె.

**8.** "జితేంద్రియుండై రెండేండ్లిచట భువనేశ్వరీ మంత్రమును జపింప నద్దేవి యెల్లకోర్కులు నిచ్చు. మఱియు సద్యస్సిద్ధి గావలయు నెడ, దూరదృష్టి నభిలషించువాఁ డావాఁడి గోరుగంటం గన్ను లూడఁ బెఱికికొనియు, దూరశ్రవణంబుఁ గోరువాఁడు ఘోరమైన యా బలు నారసంబుఁ జెవులఁ బఱపుకొనియు, సారస్వతప్రౌఢిమార్థి యీ సురియ నాలుకఁ గోసికొనియు, నిమ్మహాశక్తిని మెప్పించి యీప్సితంబువడయు. మఱియు నీమెఱుఁగు గండకత్తెరచేఁ దఱిఁగి తలనిచ్చు సాహసికుఁడు మగుడఁ దన శిరం బెప్పటియట్ల యదుకుకొనఁగా మని, తనుఁ జంపఁ గడఁగినవానిఁ గడతేర్ప నేర్చు. సదమల రూప గానాస్పదమైన వార వధూరత్నము నిచట బలిగా నిడఁ గలుగు ప్రోడ కెదిరి తాఁకు వీఁకులేని రాసిరి యఱచేతి యుసిరికయగు."

**9.** అని చదివి కలభాషిణి, యింకఁ దన కచటఁ జావు తప్పదను గట్టి తలంపునఁ గలఁగి చలించుధైర్య గౌరవంబు నల్లన ముగిడ్చి కడమ లిపి నిట్లని చదివె.

**10.** "ఈ విధు లుక్తవిధానమ్మున నిర్వర్తింపనేరని వృద్ధు లిద్దేవతయొద్ద భయంబెడలి మెయిఁ బాయుదురేని నవయౌవనరూపంబు

ప్రాప్తించు; ఉసురు దొఱఁగునప్పుడేది కోరుకొనం బడునో, యది వారికి నాఁటంగోలె శాశ్వతంబుగ సంఘటిలు."

11. అని చదివి మిన్నకున్న నవ్వ, 'బిడ్డా! తెలిసితివా యీ పాపాత్ముని కలరూపు? నేనును దుదిమాట వినియ ముదుసలి నవుట నది యభిలషించి యిచట మనుచునుంటి. నా పేరు సుముఖాసత్తి యండ్రు. కాశ్మీర దేశమున శారదాపీఠము ప్రఖ్యాతముకదా. అందు శారదాదేవి నర్చించు పూజారి బ్రాహ్మణుని పట్టిని. అని నొడువు నంతలో సిద్ధుండును దేవీపూజకుఁ దగిన గంధమాల్యాదులు కొని వచ్చి యమ్ముదుసలిం జూచి, 'యవ్వా! కుశలమే? ఈ నిర్జన ప్రదేశమున నెట్లు వేఁగుచున్నదానవో!' అని కలభాషిణిం బిలిచి, 'చెలువా! ఘన మవ్వలికిఁ బోవలసియున్నది కదా. ప్రొద్దు పోవుచున్నది. దేవి నర్చించి చెచ్చెరఁ బోవుదము' రమ్మని యనుటయు నాపె భయమునఁ గలఁగుచు, 'నవ్వా! నీవును రమ్ము. లోనికిఁ బోవుద;' మని దీనముగఁ బలికె.

12. సిద్ధుండును 'ముద్దియా! నేనుండ నీకు వెఱ పేల?' యని యనుచు 'నిమ్ముదుసలి జంతవలన నా యుదంతం బంతయు నిది యెఱిఁగికొనెఁ గాబోలు ఇఁక నాలసించిన నేమి విఘ్న మాపాదించునో' యని రమ్మని తొందరింపఁ దడఁబడి మసలు నప్పుడ్వఁబోఁడి కొప్పుంబట్టి తివంబోవ నప్పడంతియుఁ బ్రాణభయంబునఁగలఁగి, అవ్వా! నేను నీ బిడ్డను, రమ్ము, నా కడ్డపడుము. ఈ యంతకాకారుండు నన్ను మడియించు చున్నాఁ' డని యెలుఁగెత్తి మొత్తుకొనుచుఁ గురరి చాడ్పున విలపించె

13. అవ్వృద్ధనారియుఁ గరుణఁ గఱఁగి బిరబిర లోని కరిగి కలభాషిణిం దన వెనుక నిముడుకొనుచుఁ 'గావు కావు' మని వాని కరములు పట్టి అక్కటికి కిరాతుండును నక్కటికంబు మాని 'జంతవై నా పూనిక కంతరాయంబు గలిగింతువే? ఇంతియ నీకుఁ దగినశాస్తి' యని దానిచేతులు నులిమి యావలకు నెట్టి యప్పట్టునఁ గలభాషిణి నొక కేల నదిమిపట్టి యొక కేల బెట్టిదంపు కత్తి నెత్తి

'నీ కప్పనమిదె' యని సత్తి కెదురుగ వ్రేయ సమకట్టె. 'దీనిం దెగవేయు దేని నీ దేవియాన సు'మ్మని యమ్మదుసలియు మగుడ నడ్డంబువచ్చి యా నెలంత మెడకు యడ్డంబుగాఁ దన మెడ యొగ్గి నిలిచె.

14 అంతకు నక్క రాకుం డుడుగక కలభాషిణిం బోదివియేయ నదునున నుంకించుచుండఁ గరుణారసంబునఁ గఱఁగి ముదుసలియు, 'నోయి సిద్ధుఁడా! నీకుఁ గార్యసిద్ధి గాదుసుమీ ! ఇద్దేవి యాన నతిక్రమించుచుంటి;' వని యఱచుచు 'నో మహాశక్తీ! నన్ను సత్యవచనం గావింపుమా; ఈ పసిపాపం గాపాడుమా!' యనుచుండ నతం డఖండ రోషంబున మున్ను దాని మెడ నఱికి విచిత్రవేగంబునఁ గలభాషిణి కొప్పుఁబట్టి పట్టెంబు ఝళిపించి వ్రేయ నెత్తుటయు నెత్తినచేయి తత్క్షణంబ యందుకొని మృగేంద్రవాహన తన యాన నుల్లంఘించిన కించు నవ్వాని నతిదూరంబునం బడవైచె. సుముఖాసత్తియు నట్లు కత్తి వ్రేటునఁ దన జరద్దేహంబు వడిన మఱునిముసమున మహిత సర్వాంగ లావణ్యమహిమ మెఱయ కొమరుప్రాయంపురూపు విచిత్ర గతిం దాల్చె. అట్లు లేఁబ్రాయపు రూపుఁ బడయుచు సుముఖాసత్తి, సత్తి దవ్వులం బాఱవైవ నాకసమున నొకకేలఁ గత్తిని, నొకకేలఁ గలభాషిణిని విడక చను సిద్ధునిం గని కలభాషిణి గతికిఁ గలంగి తన చిరాకాంక్షిత మీడేరినను నంతగా సంతసింపక చింతిలి పొగులఁ గడఁగె. పిదప నా క్రౌంచవరాలును సంసారంబునఁ దవులువడక, చిరసముపార్జితంబైన తన జవ్వనంబు పొలివోకుండ, మోక్షంబువడయు కోరిక నయ్యెడన యమ్మహాశక్తియె గురువుగ యోగాభ్యాసంబు సేయఁ దిరంపడి యట్ల మెలంగుచుండె.

15. అంతఁ గలభాషిణియు నచ్చట కేగుదెంచి యా చంచలాక్షి నీక్షించి, 'నీ వెవ్వతెవు? ఎందుండి యిందుల కేతెంచితి?' వని యడుగ నమ్మించుఁబోడియు, 'నీ కడ్డపడి కత్తివ్రేటుదిన్న సుముఖాసత్తినిసుమా! అట్లుసురు దొఱఁగి తిరుగ నిమ్మహాదేవి దయవలన నిట్టి రూపు వడసితి కలభాషిణీ! నీ వట్లు శక్తిచే దూరవిక్షిప్తవై యెందుఁ బడితివి? ఏమియు నొవ్వ కిందులకుఁ దిరిగి యెట్లు రానేర్చితి?' వని యడుగ, నప్పడంతియు

'దేవీప్రసాదంబునను, నీ కారుణ్యావిలసనంబునను, దిరిగి రాఁగలిగితి, నా విధంబంతయు విన్నవించెద. వినుమ' మని పలికె.

16. అంతలో మణికంధరుండును నట కరుదెంచి కలభాషిణిం జూచి 'ఓహోహో! కలభాషిణీ! నిన్నుఁగని మా బంధువ్యూహంబు నంతయుఁ గనినట్లు ప్రాణములు లేచి వచ్చినవి. ద్వారకాపురి మనవా రందఱుఁ గుశలమే? నాఁడు మొదలిడిన యదుసింహుని సేవలు సిద్ధమయినవియే? నీ గానవిద్య రాణించుచున్నదియే? పాటల కాయుపేంద్రుఁడు దన కొలువు కూటమునకు నిన్నుఁ బిలువ నంపుచుండునే? నారదుండును నెప్పటియట్ల వచ్చుచుఁ బోవుచునున్న వాఁడా? నీ వెచ్చటి కరుగుచు నిచ్చటి కెటులు వచ్చితివి? వచ్చితివిపో, ఆ దేవదేవుని దేవేరు లొసఁగిన వీణె నేలఁ గొనరావైతివి?' అని కొంత ప్రసంగంబు సాగించి యాతీఁగబోఁడి వాని తగు నుత్తరంబుల కలరి వెండియు మణికంధరుండు 'కలభాషిణీ! నాఁడు నీ మనమున నేదియేదియో యొక కోర్కి గలుగుట వింటి, అది ప్రవృద్ధంబుగా వీణెపై వేడ్కవిడవుగదా?' యని యడుగుడు నప్పుడంతియు సిగ్గిలి తలవాంచి, 'మణికంధరా! దానం జేసియు కదా యిచ్చటి కేతేరి పడరానిపాట్లు పడుచుంటి' నని తన యుపవనికి మణిస్తంభుని రాక మొదలుగ నంత దనుకఁగల కత యెల్లఁ దెల్లముగఁ దెలిపి, తాను బలిబశువుగాఁజిక్కుటయు, సుముఖాసత్తి తన్ను రక్షించుటయు, వివరించి యా సాధ్వి యీపెయే యని యామెం జూపి, యాపె కుల గోత్రాదికంబు లభివర్ణించి, 'మణికంధరా! ఇంక నాకు నీ చందంబు వినవలయుఁ, దపోవిఘ్నంబు మీఁదటి భవదీయ ప్రవర్తనం బెఱిఁగింపు' మను నంతట మణిస్తంభుండు వచ్చుటయు నిప్పుడేఁ జెప్పిన సిద్ధుం డితండ యని చూపిన, నితండా? యని దరహసితవికసితాననుం డగుచు మణికంధరుం డతనిఁ దగు రీతి సంభావించె.

17. మణిస్తంభుఁడును వారల రాక కచ్చెరువొంది, 'మీ రెచ్చోటినుండి యిచ్చటికి విచ్చేసితిరి? ఇది యంతయు నాకుఁ గలగఁ దోఁచుచున్నది.' అని యనుచుఁ గలభాషిణిం జూచి 'నీవిప్పు డక్కడ

నుంటివే? ఇక్కడి కెప్పుడు వచ్చితివి?' అని వెఱఁగందుచు సుముఖా సత్తి కథ యెల్లఁ దెల్లముగ నడిగి యాపెచేఁ జెప్పించుకొని విని వెఱఁగుపడుచు నాపె నభినుతించె.

18. సుముఖాసత్తియు మణిస్తంభుని రాక కరుదు పడుచు 'సిద్ధుఁడా! దేవి విసరివైన మీ రిరువురు నెచటఁ బడితిరి? తిరిగి కసుగందక యిం దెటులు రాఁగలిగితిరి? వినవలతుఁ దెలుపు' మన మణిస్తంభుఁ డంతియకాక యెన్నో విచిత్రములును జూడవచ్చితి, వినుపింతు వినుమని యిట్లు వినిపింప గడఁగె.

19. 'అట్లురువడి మహాశక్తి విసరి వైవ నాకసమునఁ జని యేనును గలభాషిణియు మణికంధరుని తపోవనమున నొక మెట్టని క్రొత్త విరుఁబాన్పుగయింబడితిమి. నడియుఁ జావక బ్రతికియుండ నిమ్మహాశక్తి కరుణయె కతము. మునుపటి మహాభయము మాన్పడి యునికిఁ జేతి కత్తియుఁ దనతలయు, విడిచియు నెఱుగని ననుఁ గని గడగడ వడఁకుచు గలభాషిణి యించుక యెడగలిగి పసిఁడి బొమ్మవోలె నిలువంబడియుండె. నేను నల్లన గనులు విచ్చిచూచునప్పటి కయ్యొప్పుల కుప్ప మదనజయలక్ష్మివోలె నాకట్టెదుటఁ గనుపట్టె. 'ఈ పాపి యెవ్వఁడో బలిమి ననుఁ బట్టి కలఁచుచున్నాఁడు; రారే, వీక్షింపరే, రక్షింపరే,' యని పేరెలుఁగున నాక్రోశించె. అయ్యెలి వాలించి, 'యిదె వచ్చితి వెఱవకు, మెవ్వఁడురా అద్దురాత్ముఁ?' డని యఱచుచు నొక పొదరిల్లు వెల్వడి నలకూబరుఁడు పరుగిడి వచ్చె. వానిం గని నేనుం గలంగి కాలికొలందిఁ బాఱితి. కౌబేరియు విడక నాపిఱుందు నంటి కూఁత మట్టి పట్టుకొని, 'ఓరీ, నీ వెవ్వఁడవు! పోతరించి యున్మాదివై యిప్పుడే మగువం బట్టి చెఱఁబెట్టనుంకించితివి? పది ఆఁపె జూపుము. రమ్ము, అమీఁద నీకుఁ దగు ప్రాయశ్చిత్త మొనరించు' నని గద్దించి పలికి, కొంతమేర ననుఁ గ్రమ్మఱఁ దెచ్చునంత; నలిగిన యంగంబులును, వలువయుఁ, దురుమును సవరించుకొనుచు రంభ నలకూబరుండు వచ్చిన త్రోవన మా కెదురుగ వచ్చి 'ప్రాణేశ్వరా! చాలుఁజాలు. చేతఁ గైదువు గీదువేదియు లేకయే యిట్లు

దూర మేతెంతురే? మిము వెదకుచు నేఁ గడు నొచ్చితి' నని పలికి, నన్నుఁగని 'ఓహో, వీఁడా! ఆ యన్యాయములకుఁ బూనిన పుణ్యుండు? ఆ యింతిం జూపక యింక వీఁ డెందుబోయెడు? వచ్చిన భయము లేదు. చేయి విడువు'డని నను విడిపించె. నేనును వారలఁ దోడ్కొని తొల్లిటి పాన్పు కడ కరుదెంచితి కాని యా చాన నందు నెందుఁగానక కర మరసితిమి. జాడ పొడకట్టదయ్యె. అట్టియెడ నయ్యెడఁ బడియున్న నా కత్తిని నలకూబరుండు పుచ్చుకొనియె నలకూబరుఁడు కేలనా పట్టెంబు పట్టుకొని యయ్యతివ నెచ్చట దాఁచితివి? చూపుమని ధట్టించి యడిగె. నేను కళవళపడుచుంటి. అంత రంభ నలకూబరునితో 'దీని కింత గొడవయేల? సం దగసి యా వెలది యెటో ప్రాణరక్షణార్తై వెడలియుండు. చూపుమనిన వీఁడెచటనుండి చూపనోపు? విడువు' డని పలికి నను విడిపించె. పౌలస్త్యుఁడును 'మనమే యా యెలనాగ జాడ లరయుదము ర'మ్మని మును నావచ్చినత్రోవన రంభతో సాగె. నేనును వారివెంట నరిగితి. అట్లు వారు కొంతద వ్వరిగి యిఁక లాభము లేదని యొక పొదరింట విశ్రమింపఁ దూఁకొనిరి. గురుప్రసాద మవుట నా కృపాణము నెందేని యా నలకూబరుం డేమఱ విడిచి పెట్టునేమో తెచ్చుకొందుఁగాక యని గంపెఁడాస నేనును వారివెంటనంటి పొదరింటి కనతిదూరముననే వేఁచియుంటి కత్తితోఁబాటు నా దూర దృష్టి దూరశ్రవణంబులును దూరమైపోవ నేను దూలిపోతి.

20. అంత నడుగుల జాడలంబట్టి వేఱొక రంభ యచ్చటి కరు దెంచి నలకూబరుని పజ్జ రంభ మఱొకతె యుంట కచ్చెరు వొందుచు నిలచె. నలకూబరుండును నా యిరువురఁ జూచి చూచి రిచ్చపాటున నట్టెటగుచుండె. నాకును నది యంతయు నేదో వింతగఁ దోఁచె.

21. అట్లు వెఱఁగుపడి తిరుగుడువడు నలకూబరునిం గని సర సన యున్న మొదటి రంభ 'నాథా' అట్లు కళవళపడెదరేల? నన్నును నిక్కామినిని మాటిమాటికిఁ దిరిగి తిరిగి చూచెదరేల? మీ మన మెఱిఁగింపరా?' యని వేఁడె అతండును 'గోమలి! నీ ప్రతిబింబమే యామెయో, ఆమె ప్రతిబింబమే నీవో, యేర్పరుపరాకున్నది. ఇద్దాని

కదురువడి నే నిట్లుకావలసివచ్చె. నీ వాంకిత నాదండ దొలఁగితివో మీా కలరూపు లోకింత గుఱుతింపవచ్చు'నని బముల పలికె. అందుల కా సుందరి కలఁగి, 'అట్టులైన మిము నేఁ బాయజాల. ఈ మాయ లాఁడి యెవ్వతెయో మనల మోసగింప నేతేఱినది. ఈ కథఁ జూడ దొల్లింటి శూర్పణఖ మనమునఁ దోఁచి, నన్నుఁ గలంచుచున్నయది. కావున నింక నీ చుట్టుపట్టుల నిద్దాని నుండనిచ్చిన మంచికిరాదు. వట్టి మొగమాటము మట్టుపడ గట్టిగ నదలించి యీా పిసాసి నవ్వలకుఁ బంపుఁ'డని కాంతు కంఠంబు నొక కేలఁ గౌఁగిలించె.

22. రెండవ రంభయు సంభ్రమాశ్చర్యంబుల మునింగి యప్పలు కుల కులికి తల యూఁపుచు ముక్కున వ్రేలిడుకొని యుస్సురు మనియె. అది గని నలకూబరుం డక్లేల యయితి ? వని యడుగ నామె వాని కనియె. 'నాథా! ఏమున్నది ? మీార లేమన్నను జెల్లును. ఉస్సురు మనుటయేగదా నా కిప్పట్టునఁ గలదిక్కు ? కానిండు. తగిన తార్కాణ సేయునంతదనుక నది యన్నటులే రక్కసిని, పిసాసిని, మాయలా డిని, టక్కులాడిని నిక్కువముగ నగుదు. కాని యిది యెంతటి జంతయో నా రూపు పొల్లుపోకుండఁ దాల్పనేర్చి యీా వన్నాగమున మన కెడఁబాటు గల్పింప మిము హత్తుకొన్నది. సత్యము బయలువచ్చు నంతదనుక నిద్దాని యాటలు చెల్లఁగలవు. నాథా ! సత్యాసత్యములు లేవా ? దైవము లేదా? వేయేల ? వల్లభ ! మీారే నా దైవము. నా దిక్కు. ఈ మృక్కడి రక్కసి టక్కుల మారములకేమి ? తలఁచిన మీారే తగు నేర్పాటులు చేయఁగలరు. మా కల్ల నిజము లరయఁ గలరు. ప్రాణేశ్వరా! మఱచిరా ! అల్ల సురపొన్నగున్న నీడ మనము సోలుచుండఁ బడమటి దెస నొక వనిత యాక్రందనధ్వని వినవచ్చి మీారు చెచ్చెర లేచిపోయితిరి. నేనును మీా వెంట నంటితి. కాని త్రోవలో నొక యిఱ్ఱి డాఁపలివంకఁ బరుగిడుచునుండ నద్దాని సోయగ మును జూచుచు, నది యపశకునము నగుట శంకించి నే నిలచితి. మీారును నాకుఁ జాల దూరమైతిరి. అయ్యదనున నిది యెచటనో

తవులు వడియెఁ గాఁబోలు. వేగిరపడక మీరె విచారింపుఁడు. కల్ల నిజములు తెల్లము కాఁగలవు.'

23. అన నది విని మొదటిరంభ నలకూబరుని మొగ మొకకేల గిరుక్కునఁ దనచక్కికిఁ ద్రిప్పి, 'మనోహరా! ఈ రాకాసి నారూపుఁ దాల్చుటయె కాక, మన చరితముఁ గూడ జాటుచున్నయది. ఇంక నొవ్వరికింప నొప్పదు. కన్నుండఁ గనుపాపఁ దివియఁగల మునిముచ్చియ్యది. త్వరపడి చెయిఁ జేసికొని యావల కంపివుచ్చుఁడు' అని యాతనిఁ ద్వరపెట్టె.

24. ఆ కలికి పలుకులకు నలుక బలిసి సైరింపలేక యా కలకంఠి నధిక్షేపించుచు రెండవ రంభ. 'ఓసీ, తుళ్ళెదవేల! నిలు నిలుము. ఇల్లలికినంతనే పండు వయ్యెనే? ఇంతలోపలనే వల్లభునకు నచ్చిన యిల్లాలవైతివే? నేను లాఁతినైతినే? ఇంత కావరమే? రావే,' యని రోషకలుషాయితనేత్రయై పలికె.

25. అంత, మదింపకువే యన మదింపకువే యనియు, గంతు లడంతునన గంతు లడంతుననియుఁ, బంతము చూడవే యనఁ బంతము చూడవే యనియు, నోసీ యన నోసీ యనియు, మఱువకు మన మఱువకు మనియు, పలుకు ములుకుల యాసారంబులు ఘోర ఘోరంబై వా రిరువురకుం బోరు మేర మీఱె.

26. నలకూబరుండును నట్టిట్టులగు మొగింబున కెడ తెలుపి లేక వెఱఁగుపడి చేయునదియు లేక గుండె దడదడ మనఁ గనుచు వినుచు నుండె.

27. జగడపుఁ గూటి సత్తరువు ననునిమేషముఁ గోరి వారి వీరిఁ దగులు తందనాల జడదారి వినుదారి నత్తఱి నయ్యెడ కే తెరె. ముప్పురును భక్తి వినయంబుల నెదురేగి మునికి నమస్కరించి నిలిచిరి. నారదుం డంత నల్లన నగుచు నలకూబరా! ఏమి యీ వింత? ఇరువురు రంభల నెక్కడఁ దెచ్చితివి? వైచిత్ర్యమునకై

మఱొక రంభను గూడ సృజించి యిరువురను బోరించుచుంటివి కాఁ బోలు. నాకును విచిత్రముగ నున్నది. అందువలననే ఇంతదనుక రాక, ఆకసముననే నిలిచి చూచుచు నుంటి. మేలు మేలు. సరసత యన నీ యట్టు లుండవలె. సరియ కాని, నేను దీవింప వలయుఁగదా. ఈ యిరువురయం దెవ్వతె యందు నీకెక్కుడు మక్కువయో తెలుపుము. అద్దానిన నే దీవింతు. పోసీ, ఇరువురను నొక్కటిగనే చూచుచుంటివో, అదియును లెస్సయే!' యని పలుక సిగ్గిలి నలకూబరుండు, 'అయ్యో నేనెక్కడఁ బోరించితి నయ్యా! వీరి తెఱంగులు చూడ నాకును వెఱఁ గగుచున్నవి. ఏమియుఁదోఁచక పిచ్చివానివలె నిలిచి చూచుచుంటి' నని పలికి మున్ను దా నొక్క రంభఁగూడుట మొదలుగ నది తుది గాఁగ జరిగిన కథ యంతయుఁ దెలియఁ బలికి యతం డా యిద్దఱు రంభల యందు నొకతెం జూపి, మునీంద్రా! తొలుదొల్త నీ వాల్గం టియు నేనును నేకాంతమున నున్నచోటి కింతకు మున్న యీ నెలంత యరుదేరె' నని రెండవ యింతిం జూపె.

28 అంత నా రెండవనెలంత, 'మునీంద్రా! నాఁడు ద్వారక చేరువ మీరు మము నాడిన పలు కింతచేసె' నన, నన్యయు నట్ల యని మిన్నకుండుడు, నారదుఁడు నవ్వుచు, జవ్వనులారా ! మీ యిరువు రును యదార్థమ పలికిరి. ఆ మాట లీనాఁటికి సరిదాఁకెఁగదా. పోయి వత్తు;' నని పో నుంకించుచుండ నలకూబరుం డడ్డదవిలి 'మునివరా! ఇరువురును నిజమాడితి రంటిరిగాదా. అదెట్లో వినవలతుఁ, దేటపరు పరా?' యని వేడుకొన వీణాపాణియు, నలకూబరా ! నాఁడు తన చెలువంపు పెంపునను, బతివాల్లభ్య మహిమాతిశయంబునను గర్వించి రంభ యాడుకొను పలుకులు నే వినలేక, సవతి యేగతిఁగల్గునో, మీఁదుగ నంటివే? యని పలికితి. ఆ మాటఁ దలంచి ఆ పలుకింత చేసెనని వీరిలో నొకతె యనె. ఇంక రెండవదియో, రంభరూపు ధరించి తన ప్రియుఁ గూడఁ గోరి, యొకానొక కార్యము సాధించు పూనికనుండి, మొదల నాచే నట్టివరముఁ బడసె. అది హృదయమున

నిలిపి యీ పలుకింతచేసెనని యీపెయుఁ బలికెఁ. ఇంతియకాని వేఱొండుకాదు, పోయివత్తు' ననె.

29. 'అటులైన నిది యీ వనిత తలంపు. ఇది యిద్దానితలఁపు నని బయలు సేసి యందలి తథ్యమిథ్యాభావంబు లేరుపఱుపరా?' యని కౌబేరి వేఁడ, 'వానికేమిలేవోయి! నీవు మాత్రము భావజ్ఞుఁడవుకావా? భావింపలేవా? నిజమారయ నీ ప్రపంచమున నేభావము తథ్యము? ఇంతకు నీ పున్నెముపండినది. ఇరువురు రంభలను సంపాదించితివి సుఖముగఁ గాలముఁ గడుపు' మని నారదుఁడు యథేచ్ఛం జనియె.

30. నలకూబరుండును దన యెప్పటి యొప్పులకుప్పం గొని యరుగుచు వెంటనంటి వచ్చు రెండవరంభం గని 'ఓసీ! నీ వెన్ని యన్నను నాకు నీ వన్నియు మాయలుఁ బన్నాగములు ననియే తోఁచు చున్నవి. తగిన సాక్ష్యముఁ దెచ్చుకొనునందాఁక నిను నే నమ్మఁజాల. మరలిపొ' మ్మని తిరస్కారముగఁ బలికె. మొదటి రంభయు, 'ఓసి గయ్యాళీ! అలు మగ లేకాంతముగ నున్న చోటి కిటులు రా నీకు సిగ్గుగుట లేదా! ఆడుదానివి కాదా? ఛీ! పొ'మ్మని యీసడించి పలికె.

31. ఆ రంభ యమ్మాటలకుఁ జెవులు దూఁటులువడ నలిగి కెంపులు వాఱిన కన్నుల నాపెం జూచి, 'ఓసి చపలా! మగనివలలో వైచికొని యన్ని కొఱగాములఁ గొడగట్టితివి. నిజ మారయ వేలుపులు లేరా? నీ బండారము బయటఁ బడదా? నాఁడు నీపొగరడఁగదా? ఏల తొందర పడియెద?' వనె. మొదటిదియుఁ, జాలును లేవే నీ యఱవుల పోపో, నీ యఱచేతఁ బండ్లు వచ్చినపుడు మమ్మొఁగఱ తుఁపుగాని పో పొమ్ము. మొఱయిడుకొనుము. ఏ దైవములు నీ మొఱ విని యడ్డు పడియెదరో చూతుఁగాక!' యని యీసడించి విదిలించుచుఁ బలికె. 'కానిమ్ము, వేగిరపడకు.' నీ నుదుటనే ప్రొద్దు పొడిచెనా? ఏ దైవములైన విని నప్పుడే నా నిజ మేర్పడఁగలదు. తె' మ్మని పలికి యచ్చోటువాసి కొన్ని యడుగు లరిగి రెండవ రంభ కోపంబును మించి దీపించు మదనహేతిఘాతచేతస్తాపంబున కోర్వక

కడుంగడుఁ గృశించి ముంజేతి కంకణము జాఱిపో నిలిచి యొక్క యుపాయంబు చింతించి తిఱిగి వచ్చి యిట్లనియె, 'ఓసీ! కావరమునఁ గను మిను గానక నీ కిఁక గయ్యాళింపఁ బనిలేదు. ఆ వేలుపులే నీకు సాక్ష్య మీఁ గలరు. రమ్ము, పోదము దేవసభ' కని తన కొంగుఁబట్టి తిగియం బోవ మొదటి రంభయు 'నట్ల యౌఁగాక నడు'మని రెండడుగు లిడి యేదియో చింతించి క్రమ్మఱ నలకూబరుం జేరి దైన్యము దోఁప నిట్లనియె:—

32. 'నాథా! మిమ్ముఁ జూచియైనఁ గ్రమ్మఱక యిమ్మాయలాఁడి నా కొంగుఁబట్టి యీడ్చుచున్నయది. ఏ మొగమున దేవసభ కేగుదు? చెలుల నేమని పలుకరింతు? రంభకుఁ బ్రతిరంభయా యని వారు నవ్వరా? అది మీకును నొవ్వుగాదా? మానధనుఁడా! పోరైన నగుఁగాక, ఎదిరి నిలుతుఁగాని నీ యాన, భువి విడిచి దివి కొక్క యడుగైన నిడ నోప.'

33. అనుడు రెండవకొమ్మ యమ్మాట లాకర్ణించి, కాంతుఁడా! యీ కాంత నేర్పులరసితే? వేల్పులకడ కేతెంచినఁ దన మాయ బట్టబయలంబడునని యీ సాకు పెట్టుచున్నయది. యందును, దివి కొక్క యడుగైన నిడదఁట. అటు దోడిఁబడి నీ మీఁది యాన నిడుకొనుట ఖేచరత్వంబు కలిమియు సందియంబ. ఇంతతడవు ప్రియకాంత యని యెట్లు నమ్మితి?' వన, నది యాథార్థ్యంబ యని నలకూబరుఁడు నిరుత్తరుడై యున్న తన దండ చెలువ నుండనీక, 'యోసి మాయలాఁడివి గదె' యని మెడపట్టిపాయంద్రోసె. అది సందుగఁగొని రెండవరంభయు నయ్యిందువదన నందంద ధట్టించి 'యిట్టి వెడసేఁతల నాథుని కెడవేసి ననుఁ జేతోజాతహేతిఘాత బులపాలు సేసితివి కాన, నీవు హేతిఘాత నిమిత్తంబుచేతన కాయవియోగంబు నొందు' మని శపించె.

34. నలకూబరుండును, దక్కాలం బెట్టిదియొ గాని యాఁగాములు విచారింపలేక యిది యిట్టి శాపంబునకుఁ దగునని పలికి; యోసి! 'నీ పేరెద్ది? ఎందులదాన?' వని యడుగ, నపుడా ప్రతిరంభ సైరింపక, 'ఎవ్వతెయైన నేమి? ఇంతదనుక నను నినుఁ జేరనీక జంతయై

యల్లరిపాలు చేసినది. ఇఁక నిది యిచట నిల్వరాదని పల్కి మొదటి రంభను దవుదవ్వులఁ బోఁదోలె. నలకూబరుండును బ్రతిరంభ మీఁది వలపు బలిమినిఁ గిమ్మనక చూచుచు నూరకుండె."

35. అని సిద్ధుండు సెప్ప విని సుముఖాసత్తి, "వారిలో నెవ్వతె సత్యపురంభ యని సీయెఱుఁగుదువా? నాకు మాత్రమా వెనుదిరిగి కిమ్మనక పోయిన యాపెయే కపట సతి యని తోఁచుచున్నది. అందువలననే యాతండును మిన్నకుండె, నది యెట్టిదేఁగాని యిమ్ము. ఈ కథకడుంగడుఁ జోద్యముగ నున్నది." అనెను.

1. అర్థాదులు :- (1పేరా) ఏనికఱిండికార్వము = సింహవాహనము. (2) కాడింబాఱవైచె = ప్రయాణమునకు విముఖమాయెను. పల్లపు మఱగొమ్మ = జీనునకు వెనుకనుండు నెత్తుభాగము. (3) పల్లము = జీను. (4) జరత్తపస్విని = ముదుసలి యోగిని. సిద్ధ + అపదేశమున = యోగి యను నెపముతో. (5) శక్తి (వి) సత్తి. (8) సురియ = చురికత్తి (ప్ర) ఛురిక. రాసిరి = రాజ్యలక్ష్మి. (11) వేఁగుచున్నదానవో = బాధపడుచుంటివో ! (12) జంత = ధూర్తురాలు. కురరి (నా. నా.) అఁచులకుముకిపిట్ట, గోర్జి. (14) పట్టెంబు = బాకుకత్తి. (16) ఉపవని = ఉద్యానవనము దరహసితము = చిఱునగవు. (19) ఉలివు = ధ్వని. తురము = కొప్పు. (21) పిసాసి = పిశాచము (23) ఒప్పరికింపనొప్పదు = ఉపేక్షించరాదు. మునిమ్రుచ్చు = మోసగత్తె. (29) భావజ్ఞుఁడు = సరసుఁడు. (31) చపల (నా. నా.) చంచల స్వభావము గలది, లక్ష్మి. (33) కొమ్మ (నా. నా.) యువతి తరుశాఖ.

2. ప్రశ్నలు :-

1. సిద్ధుని సింహవాహనము నడవకుండుటకు హేతువేమి ?
2. జరత్తపస్విని కలభాషిణిలో సిద్ధునిగూర్చి యేమని చెప్పెను ?
3. "వడగల్లునకుఁ బోఁవఁ బిడుగల్లుపడియె" దీని భావమును సందర్భసహితముగ వివరించునది.
4. "అది నేఁడు నీ వలన సమకూరె" ఏది? ఎవరివలన ?
5 మణిస్తంభుఁడు దూరశ్రవణ దూరదర్శనముల నెట్లు సంపాదించెను ?
6. సిద్ధుని కత్తిబారినుండి కలభాషిణి యెట్లు రక్షింపఁబడెను ?

7. “ఈకథఁ జూడఁదొల్లింటి శూర్పణఖ మనమునఁ దోఁచి నన్నుఁ గలంచుచున్నయది.” ఆకథ యేమి? శూర్పణఖ కథ యేమి? రెంటికిని సాదృశ్యమేమి?

8. “మీరు మము నాడిన పలుకింత చేసె.” ఎవ రెవరితో నేమనిరి? దాని మూలమున నేమయ్యెను?

9. మాయారంభ మోస మెటుల బయలుపడెను? ఆమె యేమని శపింపఁబడెను?

3. రచన:– (1) రంభా ప్రతిరంభల కలహమును సంభాషణ రూపముగా వ్రాయునది. (2)మణిస్తంభుని వృత్తాంతము నాతని మాటలలోఁ దెలుపునది.

4. వ్యాకరణాంశములు:– (1) వ్రుద్ధ - ప్రుచ్ఛ - క్రుప - క్రూఁగుడు - గ్రుహము - ద్రుష్టి - స్రుక్కి - త్రుష్ణ - గ్రుడ్డి - ప్రుథివి వీనిలోఁ దగిన తావులందు వట్రువసుడుల నుంచునది. (2) మణికంధరుఁడు – తీఁగబోఁడి – అఖండ రోషము – కాశ్మీరదేశము – జితేంద్రియుఁడు – కార్యసిద్ధి – ఇవి యే సమాసములో గ్రహించునది. (3) పంక్తి - చిహ్నము - శక్తి - మణి - పీఠము - స్తంభము – ఆకాశము - దిశ వీనికి వికృతులను గ్రహించునది.



# ౫. శుకనాసోపదేశము

## శ్రీ తల్లావఝ్ఝల కృత్తివాస తీర్థులుగారు

వీరు ఒంగోలు కళాశాలలో సంస్కృతాధ్యాపకులు ఎం.ఏ, బి ఇ డి., సాహిత్యసుధాకర(హిందీ) తండ్రి శ్రీ శివశంకరశాస్త్రిగారితోఁగలసి సంస్కృత భాషనుండి "కథా సరిత్సాగరము" ఆంధ్రీకరించినారు. హిందీనుండి' ఆంగ్లభాష నుండి నవలలు, నాటకములు తెలిఁగించినారు స్వతంత్రముగాఁ బెక్కు సారస్వత వ్యాసములు, గేయ నాటికలు రచించినారు. అలంకార, శిల్ప, వేదాంతశాస్త్రములలో పరిశ్రమ చేసిన వారు.

భట్టబాణకవి సంస్కృత సాహిత్య పాథోనిధిని బుక్కిటఁ బట్టినవాఁడు. ఆయన కృతి 'కాదంబరి' అందలి శుకనాసోపదేశమున కనువాద మీ పాఠ్య భాగము.

తారాపీడ ధరాకాంతుని పుత్త్రుఁడు చంద్రాపీడుఁడు. ఇతఁడెల్ల విద్యల నభ్యసించి గురుకులము నుండి మరలి వచ్చెను. అపుడు తండ్రి యీతని యౌవ రాజ్య పదమున నిలుపఁ దలఁచెను. ఆ సమయమున వృద్ధామాత్యుఁడగు శుకనాసుఁడు చంద్రాపీడునకుఁ దగు నుపదేశమును జేయుట ప్రకృత భాగము

1. "తండ్రీ, చంద్రాపీడా! సర్వము తెఱింగి సకలశాస్త్ర కోవిదుండవైన నీకు నేను వే ఉపదేశము చేయఁ బనిలేదు. అయినను దోఁచినరీతి నుడివెద: వినుము. పడుచుఁదనపు మద మంధకార బంధురమై రత్నకాంతులచేఁగాని ప్రదీపాలోకనముచేఁగాని సూర్యకిరణంబులవలనఁగాని భేదింపఁబడదు. వయసు చెల్లినను లక్ష్మీమదము తనివి తీర తృప్తినొసంగదు. ఐశ్వర్యంబుచేఁ గన్నులు గానని వానికిఁ గజ్జలమైనను నౌషధతుల్యము గానేరదు. దర్పంబనెడి తీవ్రదాహజ్వరము శిశిరోపచారములచేనైన శాంతినొందదు విషయవిషాస్వాదమోహము సమూలముగ మణిమంత్రౌషధీ ప్రభావమువలనఁ గూడ నున్మూలింప బడదు. కామవికార పంకమున మునింగిన వానికి, సామాన్య నిద్ర తెల్లవాఱుట తోడనే యంతమొంది మెలఁకువ వచ్చును. కాని రాజ్య సుఖ సన్నిపాతనిద్రకు జాగృతి లేదు. అయ్యది మహాఘోరము, అతి దారుణము. కావున దానిని సవిస్తరముగ నెఱుంగుము. ఆగర్భసంపద,

యసమానసౌందర్యము, నవయౌవనము, అమానుషశక్తియు ననర్థంబునకు మూలకారణంబులు. వేయేల? సర్వదుశ్చేష్టితంబులకు స్థానంబులు. యౌవనారంభమున శాస్త్రజలంబుచే నజ్ఞానరూపంబగు మాలిన్యము క్షాళితం బయ్యు, బుద్ధి యొక్కొక్కప్పుడు సదసద్వివేకంబును గోల్పోవును. యువకులదృష్టి ధాళధళ్యంబుఁ గోల్పోయినను రాగకషాయితం బగును. వాతోద్ధూతంబగు జీర్ణపత్రంబువలె రాగాత్మకం బగు రజోగుణంబు యువకుల చిత్తంబును భ్రమింపఁజేయును. ఇయ్యది ప్రకృతిసిద్ధము. ఎండమావులం గాంచి జలభ్రాంతిచేఁ బిపాసాయత్తమలైన హరిణంబు లేపగిదిఁ దిరిగి తిరిగి నీరంబుఁ బొందవో యటులే విషయసుఖాస్వాదలోలుపం బగుమనంబు సుఖభ్రాంతివలన దుఃఖాకులం బగును. కావున విషయతృష్ణలు దుఃఖపరిణామములేయని గ్రహింపుము. సన్మార్గ మెఱుంగని యున్మార్గగామివలె విషయసుఖంబులం దత్యాసక్తుండగు మనుజుండు మోహంబులం బడును. చంద్రకిరణసమూహంబులు స్ఫటికమణులయందునుం బోలె నుపదేశసుగుణ సముదాయము విమలంబగు మనంబున సుకరంబుగఁ జొచ్చును.

2. గురూపదేశము స్వతఃసిద్ధముగ మలినరహితంబయ్యు కుశిష్యునివలన మాలిన్యంబు బొందును. మనమ్ము స్వచ్ఛమ్మగు మణివలె నున్నప్పుడే బింబగ్రాహ్యం బగును. కాని మత్తువలె చిత్త మున్నతఱి బింబమును గ్రహింప నశక్యంబగును. హితాహిత మార్గోపదేష్టంబగు గురూపదేశము శిష్యజనుల యజ్ఞానాంధకారముఁ బాఱఁద్రోలు ప్రదోషసమయ నిశాకరుఁడు. వయఃపరిణామకాలంబున శిరోజమ్ములు పండిపోయిన రీతి గురూపదేశము దోషజాతంబుల విమలంబు గావించి యింద్రియ నిగ్రహకారణంబై గుణరూపమ్మునఁ బరిణమించి పరిపాకదశకు వచ్చును గుణవంతుని హృదయము సైతము మదనుని తూపులకు వాలికలాయెనేని యుపదేశమంతయు నీటఁ గలసిన చందం బగును. చందనప్రభవం బైనమాత్రమున నగ్నికి దాహకశక్తి లేకుండునా? నీటం బుట్టిన కారణమునబడబానలమ్ముదహనస్వభావముం గోలుపోవునా ? అజలమైనను దేశికోపదేశ మఖిలజన మనోమాలిన్యం

బును నీరంబువలె క్షాళనమ్ము సేయును. అది జరఠ్యమైనను ననుపజాత పలితాది వైరూప్యంబులు లేని మదదోషరహితంబైన వార్ధకమునంటిది. అజ్ఞానాంధ తమసమ్ములఁ బటాపంచలుసేయు నతీతజ్యోతి. అది సామాన్య జాగ్రదవస్థరీతి నుద్వేగ భరితంబైనది గాక స్వధర్మ నిర్వహణంబునం దేమఱుపాటు లేని ప్రజాగరము.

3. నృపాలురకుఁ బెక్కండ్రుపదేష్ట లుండవచ్చును. ప్రతిధ్వని పగిది రాజాడిన మాటలకు జనులు వల్లె యనుచు భయంబున వర్తించుట సహజమ్ముగదా! అహంకార మదాంధీభూత చేతస్కులౌ నరపాలురు సదుపదేశంబులఁ బెడ చెవినిఁ బెట్టుదురు. ఒక తూఁటి వారు దేశికుల మాటల నాకర్ణించినను గజ నిమీలనము వోలె నిర్లక్ష్యముగా నుందురు అహంకార దాహజ్వర వ్యామోహములచే మహారాజుల స్వభావము లంధకారితంబు లగును. సంపదలు విద్యాభిమానంబునకు నున్మాదమ్మునకుఁ గారణమ్ములు. రాజ్యలక్ష్మి రాజ్యవిషయ వికార తంద్రప్రదంబు గదా కల్యాణార్థీ! కుమారా! యథార్థం బాలోచింపుము.

4. భటనికర కరవిలసి తాసిలతోత్పల వనవాటిలోఁ ద్రిమ్మరు తేఁటియైన లక్ష్మి, తాజన్మ మందినవేళ పారిజాతమ్ముల రాగమ్మును, చంద్రుని కాంతవక్రతను, చంచలత నుచ్చైశ్రవమ్ము నుండియు, మోహనశక్తి హాలాహలముననను, మదిరా రసంబుననుండి మదమ్మును కౌస్తుభమణివలన నైష్ఠుర్య సంపదయు, నిట్టి గుణ నికరమ్ములు సహవాస గుణమువలన స్వీకరించి, వీఁకతోఁ బైకి వెడలినది. ఇట్టిది వేఱొకటి యవనిలోఁ బలుమాఱు వెదకి వేసారినను గానరాదు.

5. ఈ సామ్రాజ్య రమారమణి లభించినను నేలుట దుస్సాధంబు గదా! భటుల కరంబుల విలసిల్లు ఖడ్గ పంజరమధ్యంబు నందున్నను బరిక్రమింపఁ జూచును; పరిచయం బరయదు, వంశంబుఁ జూడదు, రూప మవలోకింపదు, కులక్రమ మంగీకరింపదు, స్వభావము లెక్కసేయదు, నేర్పు మెచ్చుకొన నేర్చికొనదు, విద్యను వీక్షింపదు, దానంబున కానందింపదు, సర్వజ్ఞత్వంబు విచారింపదు, సదాచారంబునకు

సంతసింపదు, చూచుచుండగనే సామ్రాజ్యరమాదేవి గంధర్వ నగ లేఖవోలె నగును. లలిత నలినీవిహార లగ్నంబగు కంటకమ్మువలన క్షత యైనకీతిఁ బాద మెచ్చోటను నిలుపదు. క్రూరపౌరుష్యమును నేర్పుట కుంబోలెఁ గోరి యసిధారలందుఁ గాపురంబు సేయును. విశ్వ రూపత్వంబు గ్రహించు మాడ్కి నబ్జలోచన దేహమ్ము నాశ్రయించును. కమలగృహ వసుజననియై గంగవోలెఁ దరంగసహితంబై బుద్బుదంబు వలెఁ జంచలం బగును. పాతాళగుహ వలె నంధకారమయంబై ప్రావృట్సమయంబువలె నచిరద్యుతి కారిణియై, హిడింబి పగిది భీమసాహసైక హార్యహృదయ యై యుండును. స్వల్పసత్త్వునకు నున్మాదంబుం గూర్చును. ఈశ్వర్యకతంబున విద్యావంతుని దరిఁ జేరక, గుణవంతు నపవిత్రుభంగిఁ గేల ముట్టక, సజ్జనుం దనకుఁ బనిలేని వానిగాఁ జూచుచు సద్వంశసంభవు సర్పంబురీతి దాఁటుచు, గంటకమ్మువలె శూరుని గేలి సేయుచు, వితరణశీలుని మొగమ్ముఁ జూడక, తన చరిత్రము జగంబున నింద్రజాలమ్ముకరణిఁ జూపుచుండును. రాజ్యలక్ష్మి సంతతము ప్రతాపం బొనఁగూర్చుచు, వ్యాధి గల్పించుచు, సముద్రసంభవ యయ్యుఁ దృష్ణం బెంచుచు, శివత్వము వహించియు నశివస్వభావం బొనఁగూర్చుచు, నమృతసహోదర యయ్యుఁ గఠినయై, విగ్రహవతి యయ్యు నప్రత్యక్షదర్శనయై, పురుషోత్తమ రత యయ్యు ఖలజన ప్రియయై యుండును. దైవ వశమున దుష్టాచార యగు నీ మహీరమణికిఁ గైవసంబై, నర నాయక వ్యూహంబు విక్లబప్రవృత్తమగుచుండును. సేవకులు చామరంబులు వీవ, పట్టాభిషిక్తుండై పేరోలగంబున నున్నతఱి రాజేంద్రునకు, లలితాభిషేక సలిలంబుల గాత్రమలినంబువలె దాక్షిణ్యము గడుగంబడును. పూజితానలోద్ధూత ధూమమువలె హృదయము కలుషం బగును. పురోహితులు కుశసమ్మార్జనలు సేసినట్లోర్పు తొలంగిపోవును. తలపైఁ గిరీటంబుండుటం జేసి కలలోనైన ముసలితనమ్ము వచ్చునని తలంపఁడు. ఆతపత్రమండలమ్మునఁ బరలోక దర్శనముఁ దొలఁగుచుండును. ధీరులగు విద్వ

జ్జనాళి గర్హించిన సంపదలచే గ్రొవ్వి పంచేంద్రియ వ్యవసాయుండై, యింద్రియ లోలుండై, గర్వాంధుండై రాజు వర్తించును.

6. ఱేఁడు కుళీరంబువలెఁ దిర్యగ్భ్రమణంబుల నలరుచు, మృషావాద విషజనిత ముఖరోగులరీతిఁ బరుషంబులు పల్కుచుఁ, గాలదష్టులైనవారి చందమ్మున మంత్రబలముచేఁ దెలివి గనక, యాశపాలై సమస్తమ్ము కనకమయం బనుభ్రాంతిలో మునింగి, శ్మశానమ్ములం దగ్నిరీతి భీకరులై, తిమిర రోగులవలె నదూరదర్శులై వ్యసనములకు దాసులై, వల్మీకతృణాగ్రస్థితజలకణంబు వోలెఁ బతనోన్ముఖమ్మగు నిజస్థితి నెఱుంగరు. నృపాలుఁడు జూదమాడుటయే వినోద మనియుఁ, బానగోష్ఠి విలాసముగను, బ్రమత్తత శౌర్యముగను, స్వాచ్ఛందత ప్రభుత్వంబుగను, బరిభవ సహనమ్మె పరమ క్షమగను, దేవతలై యుట్టిగట్టుకొని యాకాశమునుండి యూడిపడినట్లు భావించి వేల్పు లొనరించు కృత్యములు చేయంబూని నగుఁబాటు చెందుదురు. కొలువులో ముచ్చట లాడుచు నిచ్చకమ్ములు పల్కు మిత్రుల గౌరవించి యవ్వారల స్తోత్రపాఠంబులకుఁ దన్మయు లగుదురు.

7. ఏ నరేంద్రులకు దయాశూన్యమ్మగు కౌటిల్యుని యర్థశాస్త్రమ్ము ప్రమాణమ్మగునో, మహా ఘోరమ్మగు మారణాత్మక శాస్త్రమ్ము నేర్చుటయం దాసక్తి పుట్టునో, పరుల వంచించువారు గురువులైరో, పాపులు, దుష్టమిత్రులు గలరో యట్టి రాజులతో మనకేమి పని!

8. జనులచే నగుఁబాటు గనకుండ సాధుల నిందఁ జెందక, సూరులచే వ్రేలు చూపించుకొనక, గురుజనుల ధిక్కరింపక, హితాహితంబులు గుర్తించి మెలంగవలయు. విభవమునకు విఱ్ఱవీఁగక, కూళలచే వంచింపఁబడక, వ్యసనమ్ముల జోలికిఁబోవకుండ నుండుము. కుమారా! నీవు ధీరుండవు. తండ్రికడనే పెక్కు శాస్త్రంబు లభ్యసించిన విద్వాంసుండవు. చంచలచిత్తులకు వివేక శూన్యులకు విత్తము మత్తు గల్పించు చుండును. త్వదీయ గుణోద్భూతమైన సంతసము నీకు సద్బుద్ధిఁ గలుగుటకుఁ బ్రోత్సహించినది. ఎంత జ్ఞానినైనను, విద్వాంసు

నైనను, సత్త్వగుణోపేతుఁడైనను, సత్కుల సంజాతుఁడైనను, ధీరుఁడైనను, గుణవంతుఁడైనను ధనలక్ష్మి నీతిదూరుని జేయును.

9. నీ తండ్రి కావించు యౌవరాజ్యాభిషేక వైభవమును గాంచుము. తరతరంబులనుండి తాతముత్తాతలు భరించిన మహీభారమ్మును వహింపుము. శత్రురమణులకుఁ గన్నీరు మున్నీరగునట్లొనర్పుము. బంధుమిత్రాదులను బ్రజలను గంటిరెప్పలవోలెం బాలింపుము. చతురంభోధి వేలావలయితంబగు వసుంధర నీ తండ్రికిఁ గైవసంబైనది. నిజ ప్రతాప ప్రభావంబునఁ దిరుగ మహీమండలమ్ముఁ జయించి యౌవరాజ్య పట్టంబు గట్టించుకొనుము.

1. అర్థాదులు :- (1 పే)ప్ర - దీప + ఆలోకనము = గొప్ప దీపముల వెలుఁగు. కజ్జలము = కాటుక. లోలుపము = మిగుల నాసక్తి గలది. (2) దేశికులు = గురువులు. తంద్ర = కునుకుపాటు. (6) కులీరము = ఎండ్రకాయ. తిర్యక్ + భ్రమణము = అడ్డముగా నడచుట. (8) సూరులు = పండితులు (సూరి ఏ.)(9) మున్నీరు = సముద్రము. (వాననీరు, నదులనీరు, ఊటనీరు, నను మూఁడువిధముల నీరు కలది)

2. ప్రశ్నలు :-

1. అనర్థములకు మూలకారణము లేవి ?
2. ఎట్టిమనసున నుపదేశములు ప్రవేశించును ?
3. గురూపదేశ ప్రభావ మెట్టిది ?
4. లక్ష్మి తన పుట్టుకతో నేయేగుణముల నెవరెవరివలన గ్రహించెను ?
5. రాజ్యలక్ష్మి తావొనరించు నింద్రజాలిక కృత్యమేమి ?
6. రాజ్యభారము వచ్చుటతోడనే సామాన్యముగాఁ గలుగు మార్పేమి ?

3. రచన :- (1) రాజ్యలక్ష్మిమూలమునఁగలుగునవర్థములనువివరించునది. (2) చంద్రపీడుఁడు శుకనాసుని మూలమున గ్రహించిన విషయములను దెల్పునది.

4. వ్యాకరణాంశములు :- మంత్రౌషధీప్రభావములు - దుశ్చేష్టితంబులు - వాతోద్ధూతంబు - త్వదీయగుణోద్భూతము - చతురంభోధి వేలావలయితము వీనియందలి సంధులను వేర్పఱచి, సంధినామములను, సమాస నామములను దెలియునది.

భారతీ ప్రెస్, తెనాలి—1958